బ్రహ్మర్షి పత్రీజీ ఆశీస్సులతో....

# ధ్యానం వల్లనే జ్ఞానం




| | | |
|---|---|---|
| రచన & ప్రచురణ | : | తటవర్తి వీరరాఘవరావు |
| 2021 సం॥రం | : | మూడు ముద్రణలు |
| కాపీలు | : | 5,000 |
| వెల | : | రూ. 60/- |



పుస్తకముల కొరకు

**తటవర్తి వీర రాఘవరావు**

తటవర్తివారి వీధి, భీమవరం - 534 201. ప॥గో॥జిల్లా.

ఫోన్ : 9490171853, సెల్ : 9440309812

email : balajipyramid.bvrm@gmail.com

# ధ్యానం వల్లనే జ్ఞానం

మానవుల దుఃఖానికి కారణం అజ్ఞానం. దుఃఖమంటే అనేక సమస్యల వల్ల కలిగే బాధ. అంటే ఆరోగ్య సమస్యలు, ఆర్థిక సమస్యలు, కుటుంబ సమస్యలు లాంటివి. ఇటువంటి దుఃఖం నుంచి పూర్తిగా బయటపడాలంటే మానవులు 'జ్ఞానం' పొంది తీరాలి. 'జ్ఞానం' పొందటానికి ప్రయత్నించకుండా ఎన్ని ప్రయత్నాలు చేసినా అంటే పూజలు, భజనలు, ప్రార్థనలు, నమాజులు, నోములు, వ్రతాలులాంటి ఎన్ని ఆరాధనలు చేసినా? గురువుల కృప కోసం ప్రయత్నించినా? జాతక దోషాలు, వాస్తు దోషాలు, నామ దోషాలు లాంటివి సరి చేసుకున్నా? రుద్రాక్షలు, తాయెత్తులు, రక్షా కవచాలు లాంటివి ఎన్ని ధరించినా? ఎన్ని వైద్య విధానాలు అనుసరించినా? దుఃఖం నుంచి పూర్తిగా బయటపడలేరు.

కానీ అన్ని సమస్యలకు 'జ్ఞానమే' శాశ్వత పరిష్కారం. అలా 'జ్ఞానం' సంపాదించుకుని జీవితంలో శాశ్వత పరిష్కారం పొందిన వారు ఎంతో మంది మనకు కనిపిస్తారు. అటువంటి వారిని లోకంలో చాలా గొప్పగా భావిస్తారు. అటువంటి వారిలో రమణ మహర్షి, రామకృష్ణ పరమహంస, వివేకానంద, యోగానంద, యుక్తేశ్వర్, లాహిరి మహాశయులు, మళయాళస్వామి, వీరబ్రహ్మేంద్రస్వామి, రాఘవేంద్రస్వామి, కబీర్, నానక్, రాధాస్వామి లాంటి వారు కొంతమంది మాత్రమే. ఇంకా సత్యసాయిబాబా, షిరిడీ సాయిబాబా, మెహర్‌బాబా లాంటి వారే కాకుండా బుద్ధుడు, కృష్ణుడు, జీసస్ క్రైస్ట్, మహమ్మద్, మహావీరుడు, పత్రీజీ లాంటి వారెందరో వున్నారు.

వీరంతా అపారమైన జ్ఞానాన్ని సంపాదించుకున్న వారే. దుఃఖం నుంచి శాశ్వతంగా బయటపడినవారే. ఇహ, పరలోక జ్ఞానం కలిగినవారే! వీరంతా ధనానికి, ధన సంపాదనకు ప్రాముఖ్యం ఇవ్వలేదు. వారి జీవితంలో యోగసాధన అంటే ధ్యాన సాధన విశేషంగా చేయడమే కాదు. అపార జ్ఞానాన్ని కూడా పొందగలిగారు. అపార ధనం వున్న వారి కంటే, చక్రవర్తుల కంటే కూడా గొప్ప వారిగా కీర్తి గడించారు. కారణం వారు పొందిన జ్ఞానమే. ఈ జ్ఞానం వల్లే వారంతా దేవుళ్ళుగా పిలువబడుతున్నారు, కొలువబడుతున్నారు.

అసలు వీరంతా భూమి మీదకు వచ్చింది... జ్ఞానాన్ని సంపాదించు




కోవటానికి, తాము సంపాదించుకున్న జ్ఞానాన్ని లోకంలోని వారందరికీ బోధించి వారందరిని కూడా జ్ఞానులుగా చెయ్యడానికి. అలా వీరందరి బోధల వల్ల ఎంతోమంది తమ అజ్ఞానాన్ని తొలగించుకుని జ్ఞానులు కాగలిగారు. దుఃఖం నుంచి బయటపడగలిగారు. వీరంతా ఆ జ్ఞానాన్నే అనేక రకాల ఉపమానాలతో వారి వారి నైపుణ్యంతో బోధించారు. ఏది ఏమైనా వారంతా మానవాళికి బోధించింది 'జ్ఞానమే'. అంతేకాదు 'ఆత్మ జ్ఞానమే'. అన్ని సమస్యలకు పరిష్కారమని కూడా చెప్పడం జరిగింది.

'జ్ఞానం' పొందకపోతే మానవులు అజ్ఞానంలోనే వుంటారు. అజ్ఞాన కారణంగా చేయకూడని పనులు, కర్మలు చేస్తారు. తద్వారా దుఃఖం అంటే కష్టాలు తెచ్చుకుంటారు, జీవితాన్ని నరకప్రాయం చేసుకుంటారు. కానీ 'జ్ఞానం' పొందడం వలన చేయకూడని పనులు చెయ్యరు. పైగా చేయవలసినవే చేస్తారు. అందుచేత కష్టాలు రావు. పైగా ఆనందం కూడా పొందగలుగుతారు. అంతేకాదుజ్ఞానం పెరిగే కొద్దీ వారు గతంలో చేసిన పాప కర్మలు దగ్ధమవుతూ వుంటాయి. అందువల్ల ప్రస్తుతం అనుభవిస్తున్న కష్టాలు తొలగిపోవడమే కాదు. భవిష్యత్తులో రాబోయే కష్టాలు కూడా రావు. అందుచేత జ్ఞానం పొందే కొద్దీ దుఃఖం తగ్గిపోతుంది. విశేషమైన 'జ్ఞానం' పొందగలిగితే దుఃఖం నుంచి శాశ్వతంగా బయటపడతారు. అంతేకాదు 'జ్ఞానం' పెరిగే కొద్దీ జీవితంలో కొన్ని తెలియని సత్యాలు తెలుసుకుంటారు.

కానీ అజ్ఞానంలో వున్నవారు ఈ దేహమే నేనని భావిస్తారు. అందుచేత దేహానికే ప్రాముఖ్యం ఇస్తారు. ఎంతసేపూ దేహ సుఖం కోసం, దేహ ఆరోగ్యం

కోసం, దేహ సౌందర్యం కోసం, దేహ సౌష్టవం కోసం, దేహ లాభాల కోసం పాటుపడుతూ వుంటారు. తమ ధనం, శక్తి, యుక్తి అన్నీ దేహం కోసమే ఉపయోగిస్తారు. ఇంకా దేహ సుఖం కోసం, దేహ ఆనందం కోసం తప్పులు, పాపాలు చేస్తారు, అధర్మంగా వ్యవహరిస్తూ వుంటారు, చేయకూడని పనులు చేస్తారు, వాటి ఫలితం దుఃఖం రూపంలో అనుభవిస్తారు. అలా అజ్ఞాన కారణంగా ఎంతో నష్టపోతారు.

కానీ జ్ఞానం పొందే కొద్దీ నేను దేహం కాదు, ఆత్మ అని తెలుస్తుంది. అపుడు వారి పనులు మారిపోతాయి, ప్రాముఖ్యతలు మారిపోతాయి. బాధ్యతలు మారిపోతాయి. దేహం కోసం, దేహ సుఖాల కోసం తప్పులు, పాపాలు చెయ్యరు. అంతేకాదు, 'జ్ఞానం' కలిగే కొద్దీ సృష్టి సిద్ధాంతాలు, నియమాలు, ధర్మాలు తెలుస్తూ వుంటాయి. అందుచేత వాటికి అనుగుణంగా జీవిస్తారు.

'జ్ఞానం' కలిగే కొద్దీ కంటికి కనిపించే వాటి గురించే కాక కంటికి కనిపించని వాటి గురించి కూడా అవగాహన కలుగుతుంది. సృష్టిలోని ఎన్నో విషయాలు తెలుసుకుంటారు. సృష్టి రహస్యాలు తెలుసుకుంటారు. అందువల్ల చెయ్యకూడని పనులు చెయ్యరు. సృష్టిలో ఏది నిత్యము? ఏది అనిత్యము? అన్నది బోధపడుతూ వుంటుంది. అందువల్ల అనిత్యమైన వాటికి ప్రాముఖ్యం ఇవ్వరు. నిత్యమైన దానికే ప్రాముఖ్యం ఇస్తారు. జీవితాన్ని వృధా చేసుకోరు.

అలాంటి 'జ్ఞానం' ధ్యానం వల్లనే వస్తుందని పత్రీజీ చెప్పడం జరిగింది. అందుచేత అంతటి జ్ఞానం కళ్ళు మూసుకుని కూర్చోవడం వల్ల ఎలా వస్తుందో? తెలుసుకుందాం.

ఒక రకంగా జ్ఞానం పొందడం అంత తేలికైన విషయం కాదు. వూరికే ధ్యానంలో కొన్ని గంటలు కళ్ళు మూసుకుని కూర్చున్నంత మాత్రాన జ్ఞానం కలుగదు. ధ్యానం ప్రారంభించిన తరువాత జ్ఞానం పొందే లోపల అంతర్గతంగా మనస్సులో ఎన్నో మార్పులు జరుగుతాయి, ఎంతో పరివర్తన కలుగుతుంది, ఎన్నో ఆటంకాలు, అవరోధాలు ఏర్పడతాయి. వాటన్నిటిని అధిగమించినపుడే జ్ఞానం పొందే అవకాశం వుంది.

ఒకవేళ వీటన్నిటి అధిగమించి కష్టపడి సాధన చేసి కొద్దిపాటి జ్ఞానం సంపాదించినా! ఏ మాత్రం అజాగ్రత్త వల్ల చిన్న పొరపాటు చేసినా, సంపాదించిన

శక్తి, జ్ఞానం కోల్పోవలసి వస్తుంది. మరల మొదటికి వచ్చే అవకాశం వుంది. అందుకే 'ఓషో' మహాశయుడు అంటారు. ఎండ ఎక్కేటప్పుడు శిఖరానికి చేరేలోపు ఎక్కడ కాలు జారినా ఆఖరికి శిఖరం దగ్గర కాలు జారినా ఆ నిలువాటి కొండకు ఒక అడుగు క్రింద వుండడు. కొండ మొదటికి జారిపోతాడు అంటే మొదటికి చేరుకుంటాడు. చేసిన ప్రయత్నం, పడిన శ్రమ అంతా వృథా అయిపోతుంది. అందుచేత జ్ఞానం పొందే మార్గంలో వేసే ప్రతి అడుగు జాగ్రత్తగా వెయ్యాలి అంటారు. పైకి వెళ్ళకపోయినా ఫర్వాలేదు. అజాగ్రత్త వల్ల అంటే తప్పులు చెయ్యడం వల్ల క్రిందకు జారి మొదటకు రాకుండా వుంటే చాలు అని అంటారు. అందుచేత వాటన్నిటి గురించి వివరంగా తెలుసుకుందాం.

## ధ్యానంలో ఏం జరుగుతుంది?

సహజంగా మనస్సు 4 రకాల గుణాలు కలిగి వుంటుంది. అవి (1)తమో గుణం, (2) రజోగుణం, (3)సాత్విక గుణం, (4)నిర్గుణం.

ఇక్కడ తమోగుణం, రజోగుణాలే మలిన గుణాలు. తమోగుణం అన్నిటి కంటే మలినగుణం. రజోగుణం తమోగుణం కంటే కొంచెం శుద్ధమైనా అది కూడా మలిన గుణమే. సాత్విక గుణమే శుద్ధ గణం. మనస్సు శూన్యమవ్వడాన్నే నిర్గుణం అంటారు.

నిర్గుణ స్థితిలో మనస్సు వుంటుంది. కానీ దాని ప్రభావం ఏమీ వుండదు. ఈ రకమైన మనస్సును రమణమహర్షి కాలిపోయిన తాడుతో పోలుస్తారు. కాలిపోయిన తాడు చూడటానికి తాడులా కనిపిస్తుంది కానీ దానికి ఏ మాత్రం పట్టు వుండదు. నిర్గుణ స్థితిలో వున్నవారి మనస్సు కూడా అలాగే వుంటుంది.

సహజంగా ధ్యానం చేయని వారి మనస్సు తమో, రజో గుణాలతో వుంటుంది. అంటే మలినంగా వుంటుంది. అంటే చెడుగా వుంటుంది. అందుచేత చెడు పనులే చేస్తారు, కష్టాలు తెచ్చుకుంటారు. మనస్సులోని ఆ చెడు తొలగించుకోనంత కాలం వారు చేసే పనుల వల్ల వారికి కష్టాలు వస్తూనే వుంటాయి, అనుభవిస్తూనే వుంటారు. జీవితమంతా ఎన్ని ప్రయత్నాలు చేసినా కష్టాలు తప్పవు. అటువంటి వారు కష్టాల నుంచి బయటపడాలంటే ధ్యానం ఒక్కటే మార్గం. కారణం ధ్యానం వల్ల మాత్రమే గుణం మారుతుంది. మనస్సు శుద్ధి అవుతుంది.

అందుచేత మొదట ధ్యానంలో మనస్సు ఎలా శుద్ధి అవుతుందో అంటే గుణాలు ఎలా మారతాయో తెలుసుకుందాం.

## చెంచల మనస్సు నిశ్చలం

ధ్యానం ప్రారంభించిక ముందు ఎవరి మనస్సైనా చెంచలంగా వుంటుంది, మలినంగా వుంటుంది. మనస్సు మలినంగా, చెంచలంగా వుండటానికి కారణం వారు తీసుకునే ఆహారం, వారి యొక్క వ్యవహారాలు.

మనస్సు చెంచలంగా వుంటుంది అన్నది తెలియాలంటే ఒక్కసారి కళు ్ళ మూసుకుంటే తెలుస్తుంది. కళ్ళు మూసుకోగానే రకరకాల ఆలోచనలు వస్తాయి. అలా ఎప్పుడూ ఒకటే ఆలోచన వుండదు. ఒకసారి గతం గురించి ఆలోచిస్తే! ఆ వెంటనే భవిష్యత్తు గురించిన ఆలోచనలు... లేకపోతే సంసారం గురించి... ఆ తరువాత సంపాదన గురించి.. ఇలా ఆలోచనలు రకరకాలుగా మారుతూ వుంటాయి. ఒక రకంగా కోతి ఒక కొమ్మ మీద నుంచి ఇంకొక కొమ్మ మీదకు, ఆ కొమ్మ మీద నుంచి ఇంకొక కొమ్మ మీదకు ఎలా గెంతుతూ వుంటుందో... అలాగే మనస్సలోని ఆలోచనలు మారుతూ వుంటాయి. అంటే మనస్సు చంచలంగా వుందని మనం తెలుసుకోవచ్చు.



అలాగే మనస్సు మలినంగా వుందా? లేదా? అనటానికి వారు చేసే పనులను బట్టి, ఆలోచనా విధానాన్ని బట్టి తెలుసుకోవచ్చు. సహజంగా మలిన మనస్సు వున్నవారు స్వార్థంతో ప్రవర్తిస్తారు. ఎంతసేపూ తమ కుటుంబ లాభాలు చూసుకుంటారు. ఇతరుల గురించి ఆలోచించారు. తమ ఆనందం కోసం ఇతరులను కష్టపెట్టడం, నష్టపెట్టడం, మోసగించడం లాంటివి చేస్తూ వుంటారు. ఇతరులకు ఏమైనా, ఇతర జంతువులు, పక్షులను ఏమైనా పట్టించుకోరు. పైగా వాటిని తమ ఆనందానికి ఉపయోగించుకుంటారు. వాటి మధ్య పోటీలు పెడతారు, బంధిస్తారు, హింసిస్తారు, చంపుతారు, భక్షిస్తారు. ఇతరుల పట్ల, ఇతర కులాల పట్ల, మతాల పట్ల ప్రాంతాల పట్ల ద్వేషాన్ని ప్రదర్శిస్తూ వుంటారు. ఇతరులకు

వున్న వాటిని చూసి అసూయ పడతారు. ఇలాంటివన్నీ మలిన గుణం యొక్క లక్షణాలు.

అలా మలినంగా, చెంచలంగా వున్న మనస్సును 'ధ్యానం'లో అంటే కళ్ళు మూసుకోగానే వచ్చే ఆలోచనలను మళ్ళించి శ్వాసమీద వుంచాలి. అంటే శ్వాసను గమనించాలి. అలా శ్వాసను గమనిస్తున్నా... మరలా మనస్సు ఆలోచనలలోకి వెళ్తుంది. అయినా సరే మరల శ్వాస మీదకు తీసుకురావాలి. ఇలా చెయ్యగా.. చెయ్యగా... ఆలోచనలు క్రమేపీ తగ్గుతూ వుంటాయి. ఆలోచనలు అలా తగ్గుతూ.. తగ్గుతూ.. నెమ్మదిగా ఆలోచనలన్నీ ఆగిపోతాయి. అదే 'ధ్యాన స్థితి'. ఈ స్థితిలో చెంచలంగా వున్న మనస్సు నిశ్చలమయినట్టు లెఖ్క. అలా ధ్యానంలో మొదటి స్థితిలో మనస్సులో కలిగే మార్పు ఇదే.

అలా చెంచల మనస్సు నిశ్చలమైనపుడు అంటే ఆలోచనలు ఆగిపోయినప్పుడు మనకు ఎన్నో లాభాలు కలుగుతాయి. ముఖ్యంగా అపారమైన ప్రాణశక్తి లభిస్తుంది. ఆ శక్తి వల్ల ఎన్నో లాభాలు కలుగుతాయి. ఈ ప్రాణ శక్తి శరీరంలో ప్రవహిస్తున్నప్పుడు శరీరంలోని నాడీ మండలం శుద్ధి అవుతుంది. తద్వారా శరీరంలోని కొన్ని రోగాలు నయమవుతాయి. అంతేకాదు శరీరానికి కొంత ప్రాణశక్తి లభించడం వల్ల శరీరం శక్తివంతం అవుతుంది. అంతకు ముందుకంటే పనులు హుషారుగా చేసుకోగలుగుతారు, అలసట వుండదు.

అంతేకాదు మనస్సు నిశ్చలమవ్వడం వల్ల అంటే శాంతించడం వల్ల మానసిక ప్రశాంతత పొందుతారు. టెన్షన్‌కు లోనైన వారు టెన్షన్ నుంచి బయటపడగలుగుతారు. మనస్సు నిశ్చమలవ్వడం వల్ల మనస్సును ఒక దానిపై కేంద్రీకరించగల శక్తి లభిస్తుంది. అంటే ఏకాగ్రత కలుగుతుంది. దానివల్ల ఏ పనినైనా నైపుణ్యంతో చేసుకోగలుగుతారు. అందువల్ల ఏ రంగంలోనైనా బాగా రాణించగలుగుతారు. లాభం పొందుతారు.

అంతేకాదు మనస్సు నిశ్చలమయ్యిందంటే మనస్సును అదుపు చేసుకున్నట్లే. అలా మనస్సును అదుపు చేసుకున్న వారు కోరికలను, కోపాన్ని కొంతవరకు అదుపు చేసుకోగలుగుతారు. తద్వారా జీవితంలో కొన్ని లాభాలు పొందగలుగుతారు.

అలా మనస్సు నిశ్చలం చేసుకున్న వారు వర్తమానంలో

జీవించగలుగుతారు. దాని వల్ల కొంతవరకు దుఃఖాన్ని అధిగమించగలుగుతారు. గడిచిపోయిన విషయాల గురించి, భవిష్యత్తులో జరగబోయే వాటి గురించి ఎక్కువగా ఆలోచించరు, బాధపడరు. సహజంగా వర్తమానంలో జీవించలేకపోవడం వల్లే మానవులు ఎక్కువగా దుఃఖపడుతున్నారు.

అలా ఈ స్థితికి చేరుకున్న వారు అంటే మనస్సు నిశ్చలం చేసుకోగలిగిన వారు జీవితంలో కొన్ని లాభాలు పొందగలుగుతారు. కానీ ఇక్కడ మనస్సు నిశ్చలమయ్యింది కానీ, నిర్మలం కాలేదు, అంటే శుద్ధి కాలేదు. అంటే గుణం మారలేదు. అందుచేత వారి ప్రవర్తనలో పెద్దగా మార్పు కనిపించదు. అంతకు ముందులాగే వారి ప్రవర్తన, పనులు వుంటాయి. అంతకు ముందులాగే తప్పులు చేస్తూ వుంటారు. స్వార్థం ప్రదర్శిస్తూంటారు.

చాలా మంది సాధన ఈ ప్రాథమిక స్థితిలోనే ఆగిపోతుంది. ఈ స్థితిలో వారు పొందే కొద్దిపాటి లాభాలు చూసుకుని తాము చేసే సాధన చాలా గొప్పగా వుందని భావిస్తారు. అందుచేత సాధన అలాగే కొనసాగిస్తారు, లేకపోతే ఆపేస్తారు. కారణం వారు పొందిన కొద్దిపాటి లాభాలే గొప్ప లాభాలని భావిస్తారు. కానీ వారు చేసే సాధన వారి గుణంలో మార్పు తీసుకురాలేదన్న సంగతి వారికి తెలియదు. గుణం మారాలంటే సాధన ఇంకా తీవ్రతరం చెయ్యాలని, దానితో పాటు ఆహార నియమాలు కఠినంగా పాటించాలన్న అవగాహన వుండదు. అందుచేత ఈ రకంగా ధ్యానం చేసేవారి మనస్సు నిశ్చలమవుతుంది. కానీ నిర్మలమవ్వదు. అంటే శుద్ధి కాదు.

సహజంగా మనస్సు మలినంగా అంటే చెడుగా వుంటే చెడు పనులు చేస్తారు, ధర్మంగా ప్రవర్తించరు. సృష్టి విరుద్ధమైన పనులు చేస్తారు. స్వార్థంతో ప్రవర్తిస్తారు. తాము తమ వారి బాగు కోసమే ప్రయత్నిస్తారు. తమ ఆనందం కోసం ఇతర జీవులను హింసిస్తూ వుంటారు. ఎంత వున్నా తృప్తి వుండదు. ఏది చూసినా ఆశపడుతారు. ఇతరులకు వున్న వాటిని చూసి అసూయ పడతారు. తమకు లేదని బాధపడతారు. సంపాదించడం కోసం తప్పులు, పాపాలు చేస్తారు. అధర్మంగా ప్రవర్తిస్తారు.

మనస్సు యొక్క మలినాన్ని బట్టి వ్యసనాలకు బానిసలవుతారు. తాగుడు, జూదం, వ్యభిచారం, మత్తు పదార్థాలు సేవించడం, పందాలు, సిగరెట్లు లాంటి

అలవాట్లకు లోనవుతారు. వీటి వల్ల ఆర్థికంగానే కాదు ఆరోగ్యపరంగా కూడా నష్టపోతారు.

వీరికి వ్యతిరేకమైన (నెగెటివ్ థాట్స్) వినాశకరమైన (డిశాస్ట్రస్ థాట్స్) ఆలోచనలు వుంటాయి, అన్నిటికి భయపడతారు, ఏ పని చెయ్యాలన్నా వెనుకాడతారు, వ్యతిరేక ఫలితాలు కలుగుతాయేమోనని భయపడతారు. వీరకి త్రికరణ శుద్ధి వుండదు. ఒకటి ఆలోచిస్తారు, మరొకటి చెపుతారు, ఇంకొకటి చేస్తారు.

వీరు తమకున్న వాటిని చూసుకుని గర్వ పడతారు, అహంకారంతో ప్రవర్తిస్తూ వుంటారు; అందరి కంటే గొప్పవాడిగా కావాలనుకుంటారు, అన్నిటిలోనూ అధికంగా వుండాలనుకుంటారు. దీనికంతటికీ కారణం మలిన గుణాలే, మనస్సులోని చెడే కారణం.

ఇటువంటి వారు మంచి చెయ్యాలనుకున్నా చెయ్యలేరు. తమకే అన్నీ తెలుసనుకుంటారు, ఎదుట వారు చెప్పింది వినరు, మూర్ఖంగా ప్రవర్తిస్తారు. సహజంగా ఇలాంటి వారికి తమో, రజో గుణాలు వుంటాయి. ఈ తమో, రజో గుణాలే మలిన గుణాలు. ఇందులో తమోగుణమే మరీ మలిన గుణం.

ఇలాంటి మలిన మనస్సు కలవారు సృష్టి విరుద్ధమైన పనులు చెయ్యడం వల్ల అంటే తప్పులు, పాపాలు చెయ్యటం వల్ల సహజంగా వారు చేసిన కర్మలకు ఫలితం కష్టాల రూపంలో అనుభవిస్తారు. జీవితంలో సమస్యలు ఎక్కువగా వుంటాయి. ఈ సమస్యలు కష్టాలు పోవడం కోసం పూజలు, ప్రార్థనలు, నమాజులు, భజనలు, ఆరాధనలు లాంటివి ఎక్కువగా చేస్తుంటారు. దీక్షలు తీసుకుంటారు, జాతకాలు చూపించుకుంటారు, వాస్తు సరి చేయించుకుంటారు, దీక్షా కంకణాలు, రక్షా కవచాలు ధరిస్తూ వుంటారు, ఎన్ని చేసినా కష్టాలు వస్తూనే వుంటాయి. కారణం వారు చేస్తున్న కర్మలే. అలాంటి కర్మలు చెయ్యడానికి కారణం వారి గుణమే. గుణం మారకపోవడానికి కారణం సాధనలో తీవ్రత లేకపోవడమే. దానికి కారణం సాధన మార్పు కోసం కాకుండా లాభాల కోసం చెయ్యడమే.

అలా జీవితంలో లాభాల కోసం ధ్యానం చేసే వారు, వారు చేసే సాధన వల్ల మనస్సు నిశ్చలమవుతుంది కానీ, నిర్మలమవ్వదు అంటే శుద్ధి

కాదు. అంటే మంచిగా మారదు. అలా ఎంతకాలం? అంటే ఎన్ని సంవత్సరాలు ధ్యానం చేసినా ఈ స్థితిలోనే వుండిపోతారు. కారణం ఏదో ఉదయం కొంతసేపు, రాత్రి కొంతసేపు చేయడం, చేసే సాధన కూడా క్రమంగా చేయకపోవడం, మధ్య, మధ్యలో బద్ధకించి మానేయడం, సరైన ఆహార నియమాలు పాటించక పోవడం వల్ల వారు ఎన్ని సంవత్సరాలు చేసినా ఈ స్థితిని దాటలేకపోతారు.

అందుచేత ధ్యానంలో వీరికి ఆరోగ్యం లాంటి కొన్ని లాభాలు కలిగినా మనస్సు శుద్ధి కాకపోవడం వల్ల వీరి ప్రవర్తనలో మార్పు కనిపించదు. అందుచేత వీరు చేసే కర్మల వల్ల కష్టాలు, సమస్యలు వస్తూనే వుంటాయి. రోగాలు తగ్గినట్టు కనిపించినా మరల వస్తూ వంఉటాయి. మనశ్శాంతి లభించినట్టుగా కనిపించినా మరల సమస్యలు రావడం వల్ల అశాంతికి లోనవుతూ వుంటారు. ఒక రకంగా ధ్యానం చెయ్యకముందు జీవితం ఎలా వుంటుందో? ఇన్నాళ్ళు ధ్యానం చేసినా జీవితం అలాగే వుంటుంది.

వీరేమనుకుంటారంటే ఎంతో కాలం నుంచి ధ్యానం చేస్తున్నాను, మరల రోగాలు వస్తున్నాయేమిటి? మరల సమస్యలు వస్తున్నాయేమిటి? మరల అశాంతి కలుగుతుందేమిటి? ఎన్ని సంవత్సరాలు ధ్యానం చేసినా జీవితంలో ఏ విధమైన మార్పు కలగట్లేదేమిటి? అని బాధపడుతూ వుంటారు. ధ్యానం చేస్తే అన్నీ పోతాయంటారు కదా? ఎందుకు పోవట్లేదు? అని అనుకుంటారు. ఆలోచిస్తే వారికి ఇదేమీ అర్థం కాదు.

దగ్గర వారు కూడా నువ్వు ధ్యానం చేస్తున్నావు? మరి నీకు మరల రోగం వచ్చిందేమిటి? నీకు ఆపరేషన్ ఎందుకు చెయ్యవలసి వచ్చింది? అని అడగడం కూడా జరుగుతుంది. ఇంకా కొంతమంది నువ్వు ధ్యానం చేస్తున్నావు కదా? నీ ప్రవర్తన అలాగే వుందేమిటి? అసలు నువ్వు ఏం మారావు? అని అడుగుతుంటారు. ఇంకా కొంతమంది వాడు చాలా సంవత్సరాల నుంచి ధ్యానం చేస్తున్నాడు కదా? వాడు అలా ప్రవర్తిస్తున్నాడేమిటి? అని అడిగే వారు కూడా వున్నారు.

దీనంతటికీ కారణం వారు ఎంతకాలం నుంచి ధ్యానం చేస్తున్నా ప్రారంభ స్థితిలోనే వున్నారు కానీ, తరువాత స్థితికి వారు చేరుకోలేదు. అంటే మనస్సు నిశ్చలం చేసుకున్నారు కానీ, నిర్మలం చేసుకోలేదు. అంటే మనస్సు

శుద్ధి చేసుకోలేదు. అందుకే వారి ప్రవర్తనలో మార్పు కనిపించట్లేదు. తప్పులు, పాపాలు ఇదివరకటిలాగే చేస్తున్నారు. తద్వారా మరల రోగాలు, సమస్యలు తెచ్చుకుంటున్నారు.

## నిశ్చల మనస్సు నిర్మలం చేసుకోవాలి

ఇటువంటి పరిస్థితి అధిగమించాలంటే వారు ధ్యాన సాధనను మరింత తీవ్రతరం చెయ్యాలి. ఈ మార్గంలో మరింత కృషి చెయ్యాలి. తరువాత స్థితికి చేరాలి. రెండవ స్థితికి చేరాలి. అంటే నిశ్చలమైన మనస్సును నిర్మలం చేసుకోవాలి అంటే శుద్ధి చేసుకోవాలి. అలా చేసుకోవాలి అంటే నిశ్చల మనస్సుతో అంటే ధ్యాన స్థితిలో గంటలు, గంటలు వుండగలగాలి. అలా రోజులు తరబడి, నెలల తరబడి ఆహార నియమాలు పాటిస్తూ చెయ్యగలిగితే అపుడు నెమ్మదిగా వారి మనస్సు శుద్ధమవుతూ వుంటుంది. అంటే నిశ్చలమైన మనస్సు నిర్మలమవుతుంది. అంటే ధ్యానంలో రెండవ స్థితికి చేరుకుంటారు. వారు మనస్సులోని మలిన గుణాలైన తమోగుణం తొలగించుకుని రజోగుణం... రజోగుణం తొలగించుకుని సాత్విక గుణం సంపాదించుకుంటారు. అందువల్ల వారి మనస్సు శుద్ధమవుతుంది అంటే  మంచిగా మారుతుంది. అంటే పవిత్రమవుతుంది.

ఇక్కడ గమనించవలసిందేమిటంటే మనస్సు నిర్మలమవ్వాలంటే ముందు మనస్సు నిశ్చలమవ్వాలి. మనస్సు నిశ్చలం కాకుండా నిర్మలం కాదు. నిశ్చల స్థితిలో గంటలు, గంటలు వుండగలిగితేనే మనస్సు నెమ్మదిగా నిర్మలమవుతుంది. ఉదాహరణకు ఒక గ్లాసులో శుభ్రమైన నీరు పోసి దానిలో కొద్దిగా ఇసుక వేసి ఆ నీటిని స్పూనుతో కదపండి. ఆ నీరంతా మట్టితో కలిసి మలినమవుతుంది. మరల ఆ నీటిని యధా ప్రకారం శుభ్రంగా మార్చాలంటే ముందర ఆ నీటిని కదపకుండా నిశ్చలంగా వుంచాలి. అలా కదపకుండా కొన్ని గంటలు వుంచితే మెల్లిగా నీటిలో కలిసి ఇసుక గ్లాసు అడుగు భాగానికి దిగుతుంది. అలా ఆ నీటిని కదపకుండా కొన్ని రోజులు వుంచగలిగితే ఆ నీటిలోని మురికి మొత్తం క్రిందకు దిగి నీరు యధాప్రకారం శుద్ధంగా, మంచిగా మారిపోతుంది.

కానీ ఆ నీటిని నిశ్చలంగా వుంచకుండా మధ్య, మధ్యలో కదుపుతూ వుంటే ఆ నీరు స్వచ్ఛమవ్వదు. యధా ప్రకారం మురికిగానే వుంటుంది.

అందుచేత నీరు నిర్మలమవ్వాలంటే ముందు నిశ్చలం కావలసిందే. అలాగే మనస్సు నిర్మలమవ్వాలంటే అంటే మనస్సులోని మాలిన్యం పోవాలంటే మనస్సును నిశ్చల స్థితిలో ఉంచవలసిందే. ఏదో ప్రొద్దున కాసేపు, రాత్రి కాసేపు ధ్యానంలో కూర్చుంటే సరిపోదు. నిశ్చల స్థితిలో గంటలు గంటలు వుంచవలసిందే. అలా రోజుల తరబడి, నెలల తరబడి చేయగలిగితే తప్పని సరిగా మనస్సు శుద్ధమవుతుంది. అంటే వారిలోని మలిన గుణాలు అంటే తమోగుణం, రజోగుణం తొలగిపోతాయి. మెల్లిగా వారు సాత్విక గుణంలోకి వస్తారు.

ఈ రకంగా మనస్సు మారగానే వారి ప్రవర్తనలో చాలా మార్పులు కనిపిస్తాయి. ఒక రకంగా చెప్పాలంటే ఇదివరకటి ప్రవర్తనకు పూర్తి భిన్నంగా మారిపోతుంది. వారికే తెలియని విధంగా వారి ప్రవర్తన మారిపోతుంది.

వారి మనస్సులోని మాలిన్యం పోయే కొద్దీ వారు చేసే చెడు పనులు అంటే ఎదుట వారిని మోసగించడం, బాధించడం, తిట్టడం, విమర్శించడం, సరదా కోసం పరిహాసాలు ఆడటం, అలా పరిహాస మాడుతూ ఏడిపించడం, రాగింగులు చేసి అవతలి వారిని బాధించడం లాంటివి మెల్లిగా తగ్గిపోతాయి. అలాంటి ప్రవర్తన మెల్లిగా వారిలో కనిపించదు. కారణం మనస్సు శుద్ధమైంది కాబట్టి.

అంతేకాదు ఎదుట వారివి ఆశపడరు, అపహరించరు, దొంగిలించరు, చూడకుండా, చెప్పకుండా తీసుకోరు. కక్కుర్తి పడరు. ఇలా ప్రవర్తన మారిపోతుంది.

వారికి వున్న చెడు అలవాట్లు సిగరెట్టు కాల్చడం, జూదం ఆడడం, పందాలు కాయడం లాంటివి మెల్లిగా మానేస్తారు. అలాగే చెడు వ్యసనాలు అంటే మాంసం తినడం, తాగుడు, వ్యభిచారం, మత్తు మందులు సేవించడం లాంటివి కూడా మనస్సు బాగా శుద్ధమవుతే అంతకు ముందు ఎన్ని సార్లు చెప్పినా మానని వారు... వారికి తెలియకుండానే వారంతట వారే మానేస్తారు. చూసే వారికి ఆశ్చర్యం కలుగుతుంది.

దీనికి కారణం మనస్సు శుద్ధి కావడం. అసలు ఈ అలవాట్లు, వ్యసనాలు మానలేకపోవటానికి కారణం మనస్సు యొక్క మలిన గుణాల వల్లే. అందుకే

ఇటువంటి అలవాట్లు వున్న వారు ఆ అలవాట్లతో ఆరోగ్యం పాడు చేసుకుంటున్నా, సంపాదించిందంతా పోగొట్టుకుంటున్నా, సంసారంలో గొడవలు పడుతున్నా మానలేరు. కొంతమంది ఎంత నచ్చచెప్పినా, మానుకోవాలని వుందికానీ నా మనస్సు ఒప్పుకోవట్లేదు అంటారు. వారికి ఒక ప్రక్క నుంచి మానాలనిపిస్తుంది. కానీ మానలేరు. ఆ టైమ్‌కి మనస్సు అటువైపు లాగేస్తూ వుంటుంది. శరీరానికి ఎంత నష్టం జరిగినా... మనస్సు మాత్రం కావాలనే అంటుంది. శరీరం సహకరించక పోయినా ఆ అలవాటు మానుకోలేరు. కారణం మలిన మనస్సు.

కానీ మనస్సు శుద్ధమవ్వగానే వారి దృష్టి అటు పోదు. ఆ పని చెయ్యాలనిపించదు. శుద్ధ మనస్సు వారిని ఇబ్బంది పెట్టదు. అసలు ఆ ఆలోచనే వారి మనస్సులో కలగదు. వారిలోని మార్పు వారికే కాదు. ఇతరులకు కూడా ఆశ్చర్యం కలిగిస్తుంది.

అలా మనస్సు శుద్ధి అయ్యే కొద్దీ వారి ప్రవర్తనలో మార్పులు ఎలా వస్తాయో తెలుసుకుందాం. గ్లాసులోని నీటిని నిశ్చలంగా వుంచినపుడు మొదట మట్టిలోని పెద్ద, పెద్ద బరువుగా వున్న రేణువులు క్రిందకు దిగుతాయి, తరువాత దాని కన్నా చిన్న రేణువులు కిందకు దిగుతాయి. తరువాత బాగా తేలికైన రేణువులు దిగుతాయి. చివరకు సూక్ష్మాతి సూక్ష్మమైనవి కూడా దిగిపోవడం వల్ల నీరు ఇదివరకటి వలె స్వచ్ఛంగా, శుద్ధంగా తయారవుతుంది.

అలాగే మనస్సు శుద్ధి అయ్యే కొద్దీ మొదట పెద్ద పెద్ద పాపాలు అంటే కోళ్ళను చంపడం, మేకలను, గొర్రెలను చంపడం, పందులు, ఆవులు చంపడం లాంటి పెద్ద పెద్ద పాపాలు మానేస్తారు. మనస్సు ఇంకా శుద్ధమయ్యే కొద్దీ చిన్న చిన్న పాపాలు అంటే ఎలుకలు, బొద్దింకలు లాంటి వాటిని చంపడం మానేస్తారు. సాధన ఇంకా తీవ్రతరం చేస్తే మనస్సు ఇంకా శుద్ధమవుతుంది. అపుడు బుల్లి, బుల్లి పాపాలు అంటే దోమలు, చీమలు లాంటివి కూడా చంపడం మానేస్తారు. మనస్సు ఇంకా బాగా శుద్ధమవుతే సూక్ష్మాతి సూక్ష్మమైన పాపాలు అంటే పట్టుచీరలు కట్టరు, పట్టు వస్త్రాలు ధరించరు. అలా పట్టు వస్త్రాలు తయారు చేయటానికి కారణమైన పట్టుపురుగుల హింసకు కారణం కారు.

అంటే మనస్సు శుద్ధమయ్యే కొద్దీ మొదట పెద్ద పెద్ద తప్పులు చేయరు.

అంటే ఇతర మానవులను హత్యలు చేయరు, కాళ్ళు చేతులు నరకరు, యాసిడ్‌తో దాడి చేయరు, మానభంగాలు, హత్యలు చెయ్యరు, శాడిస్టులా, రాక్షసుడిలా భార్యను, ఇతర స్త్రీలను చిత్రహింసలు పెట్టరు. వారి మనస్సు ఇంకా శు ద్ధమవుతే చిన్న చిన్న తప్పులు అంటే లూటీలు, దోపిడీలు చెయ్యడం, వాటి కోసం దౌర్జన్యాలు చెయ్యడం, కొట్టడం, స్త్రీలను లొంగదీసుకోవటానికి వారిని కొట్టడం, కిడ్నాప్‌లు చెయ్యటం, అల్పులను, బలహీనుల మీద ఆధిపత్యం చెయ్యడం, వారిని బాధించడం లాంటివి చెయ్యరు. వారి మనస్సు ఇంకా శు ద్ధమవుతే బుల్లి బుల్లి తప్పులు, అంటే మోసాలు చెయ్యడం, ఇతరులకు తెలియకుండా దొంగతనాలు చెయ్యడం, స్త్రీలను, భార్యలను తిట్టడం, పరుష పదజాలంతో దూషించడం లాంటివి చెయ్యరు. వారి మనస్సు ఇంకా శుద్ధమవుతే సూక్ష్మాతి సూక్ష్మమైన తప్పులు అంటే విమర్శించడం, నిందలు వెయ్యడం, పరోక్షంగా దూషించడం లాంటివి చెయ్యరు.

చివరకు మనస్సు పూర్తిగా శుద్ధమైనపుడు ఏ రకమైన తప్పులు, పాపాలు చెయ్యరు. తమ వల్ల ఇతరులకు, ఇతర జీవులకు ఎటువంటి కష్టం, నష్టం, హాని, బాధ కలిగించరు. ఈ స్థితికి వచ్చిన వారు కష్టాల నుంచి పూర్తిగా బయటపడతారు. భవిష్యత్తులో వారి జీవితంలో కష్టాలే వుండవు. కారణం తప్పులు, పాపాలు చేయరు కనుక.

అంతేకాదు ఈ స్థితిలో వున్న వారికి నెగెటివ్ ఆలోచనలు వుండవు అన్నీ అనుకూలంగానే ఆలోచిస్తారు. అందుచేత జీవితంలో అనుకూల ఫలితాలే కలుగుతూ వుంటాయి. తద్వారా జీవితంలో ఆనందం పొందగలుగుతారు.

అంతేకాదు వారి మనస్సు శుద్ధి అయ్యే కొద్దీ వారి 'బుద్ధి' వికసిస్తూ వుంటుంది. పూర్తిగా శుద్ధి అయితే పూర్తిగా వికసిస్తుంది. అంతకు ముందు బుద్ధి వుంటుంది కానీ మొగ్గలా ముడుచుకుని వుంటుంది. దాని నుంచి పరిమళాలు వెలువడవు. అంటే వారి వల్ల ఎవరికీ ప్రయోజనం వుండదు. కానీ బుద్ధి పూవులా వికసించే కొద్దీ... పూవు తన అందాలు ఆరబోసినట్లు తన పరిమళాలు వెదజల్లినట్లు బుద్ధి బుద్ధునిలా వికసించినవారు. ఇతరులకు లోకానికి ఎంతో మేలు చేస్తారు, ఎన్నో లాభాలు కలిగిస్తారు. అంతేకాదు బుద్ధి వికసించే కొద్దీ వివేకం కలుగుతుంది. విచక్షణా జ్ఞానం ఏర్పడుతుంది. అందువల్ల ఏది

మంచి?-ఏది చెడు? ఏది న్యాయం?-ఏది అన్యాయం? ఏది క్రమము?-ఏది అక్రమము? ఏది సవ్యం?-ఏది అపసవ్యం? ఏది ధర్మం?-ఏది అధర్మం? ఏది నిత్యం?-ఏది అనిత్యం? ఏది సత్యం?-ఏది అసత్యం? అన్న తేడా తెలుస్తుంది. ప్రతి విషయం ఆలోచించగలుగుతారు, ఆలోచిస్తారు. సరికాని దానిని వదిలివేస్తారు. సరైనదే గ్రహిస్తారు. అందువల్ల చేయకూడని పనులు చేయరు. అందువల్ల భవిష్యత్తులో కష్టాలు రావు.

వీరు ఎవరు చెప్పినా గుడ్డిగా నమ్మరు. తమ వివేకాన్ని ఉపయోగిస్తారు.

ఈ స్థితిలో సాధన అలాగే కొనసాగిస్తూ వుంటే మనస్సు ఇంకా శుద్ధమవుతుంది. అపుడు వారి బుద్ధి బుద్ధునిలా పని చేస్తుంది. ఈ స్థితిలో స్వార్థం పోతుంది. ఎవరినీ ద్వేషించరు. ఎవరి మీద అసూయ పడరు. ఈర్ష్య వుండదు. అందరినీ ఇష్టపడతారు. అందరినీ ప్రేమించగలుగుతారు. ఈ స్థితిలో ఎవరికి చెడు చేయలేరు, చేయరు. వీలైనంత మంచే చేస్తారు. సాయం చేస్తారు, సేవలు చేస్తారు. సమాజం కోసం పాటు పడతారు.

అలా మనస్సు శుద్ధి చేసుకుని బుద్ధి వికసింప చేసుకున్న వారిని కర్మ సిద్ధాంతం హాని చేయదు. కర్మ సిద్ధాంతం వల్ల వారికి నష్టం జరుగదు. పైగా కర్మ సిద్ధాంతం వల్ల వారికి అంతా లాభమే కలుగుతుంది. మంచి చేస్తుండటం వల్ల అంతా మంచే జరుగుతుంది.

కానీ మనస్సు శుద్ధి చేసుకోవాలనుకునే వారు సాధనతో పాటు మరికొన్ని నియమాలు పాటించాలి. ముఖ్యంగా ఆహారం విషయంలో చాలా జాగ్రత్తలు తీసుకోవాలి. కారణం మలినమైన మనస్సు అంటే తమోగుణం, రజోగుణంలో వున్న మనస్సు తీవ్ర సాధన వల్ల శుద్ధమై, సాత్విక గుణంలోకి వస్తుంది. అటువంటప్పుడు ఆహార నియమాలు పాటించకుండా తమో గుణ ప్రధానమైన, రజోగుణ ప్రధానమైన ఆహారాలు తీసుకున్నట్లయితే మనస్సు మరల మలినమై తమో, రజోగుణాలను సంతరించుకుంటుంది. చేసిన సాధనంతా వృధా అవుతుంది. మరల మామూలుగా మారిపోతారు. అందుచేత ఆహారం విషయంలో చాలా జాగ్రత్త వహించాలి. ముఖ్యంగా తమో గుణ ప్రధానమైన, రజోగుణ ప్రధానమైన ఆహారాలు తీసుకోకూడదు. పూర్తిగా సాత్వికమైన శాకాహారాన్నే తీసుకోవాలి.

ముఖ్యంగా మాంసాహారం, గుడ్లు పూర్తిగా మానాలి. కారణం అవి రజో గుణాన్ని కలిగిస్తాయి. అంతేకాదు మాంసాహారంతో పాటు మాంసాహారం వండిన పాత్రలు ఉపయోగించకూడదు. కారణం మాంసాహారం యొక్క దోషం ఎంతో కొంత ఆ పాత్రలలో వుంటుంది.

ఓషో ఏమన్నారంటే "మీరు మాంసాహారం తీసుకుంటే మీరు విషాన్ని భోంచేస్తున్నట్టే" అన్నారు.

మాంసాహారమే కాదు శాకాహారంలో కూడా రజోగుణాన్ని, తమోగుణాన్ని కలిగించే ఆహారాలు కూడా వున్నాయి. ముఖ్యంగా "వెల్లుల్లి" మానేయాలి. కారణం వెల్లుల్లి కూడా మలిన గుణమైన రజోగుణాన్ని కలిగిస్తుంది. దానితో పాటు ఎక్కువ మషాలాలు, ఎక్కువ కారాలు తినకూడదు. మషాలాలు, కారాలు తగ్గించడం చాలా మంచిది.

అలాగే చల్లారిపోయిన, పాసిపోయిన, పులిసిపోయిన ఆహారాలు తీసుకోకూడదు. ఇవి బాగా మలినమైన తమోగుణాన్ని కలిగిస్తాయి. అందుచేత ఉదయం వండి సాయంత్రం... సాయంత్రం వండి మరునాడు తీసుకోవడం కానీ, వండి ఫ్రిజ్‌లో వుంచిన ఆహారాలు తీసుకోవడం కానీ చేయకూడదు. బాగా పులిసిన మజ్జిగ కూడా తమోగుణాన్ని కలిగిస్తుంది.

ఈ రకమైన ఆహారాలు సాధకులకు చాలా నష్టాన్ని కలిగిస్తాయి.

ఎందుచేతనంటే ఆహారం యొక్క ప్రభావం దేహంలో కనిపించక పోయినా మనస్సుపై దాని ప్రభావం కనిపిస్తుంది. తీసుకునే ఆహారాన్ని బట్టే మనస్సు వుంటుంది. అందుచేత మనస్సు శుద్ధి చేసుకోవాలనుకునే వారు ఆహార నియమాలు తప్పనిసరిగా పాటించాలి.

అందుచేత ఆహార నియమాలు పాటిస్తూ, తీవ్ర సాధన చేయగలిగితే తప్పనిసరిగా వారి మనస్సు శుద్ధమవుతుంది.

ఇక్కడ గమనించవలసింది ఏమిటంటే మొదటి స్థితిలో వున్నవారు ఎవరైనా అంటే తమోగుణం, రజోగుణాలలో వున్నవారు తప్పనిసరిగా ఆ స్థితిని దాటడానికి ప్రయత్నించాలి. కారణం ఆ స్థితి మానవునికి హాని కలిగిస్తుంది, నష్టం చేకూరుస్తుంది, కష్టాలకు గురి చేస్తుంది. ప్రారంభ స్థితి దాటిన వాడు కష్టాల నుంచి బయటపడినట్టే! కానీ ఈ స్థితి దాటడమే చాలా చాలా కష్టం.

కారణం ఈ స్థితిలో వున్న వారికి ఎన్నో రకాల అవరోధాలు ఆటంకాలు, ఇబ్బందులు కలుగుతూ వుంటాయి.

అటువంటి వారు ఒకవేళ ధ్యాన సాధన చేద్దామనుకున్నా విపరీతమైన ఆలోచనలతో చెంచల స్థితిలో వున్న మనస్సు ధ్యానంలో కూర్చోనివ్వదు. అందుచేత ఇటువంటి వారు ధ్యానంలో కూర్చుందామని ప్రయత్నించినా కూర్చోలేరు. కాస్సేపు కూర్చుని నా వల్ల కాదని లేచిపోతారు. మరల కూర్చోడానికి ఇష్టపడరు. ఒకవేళ ఎవరైనా పట్టుదలగా ధ్యానం చేద్దామని ప్రయత్నించినా వారికి ఇంకా ఎన్నో రకాల అవరోధాలు, ఆటంకాలు కనిపిస్తాయి.

అలా చేస్తున్న వారికి సంసారంలో ఇబ్బందులు వస్తుంటాయి. సాధన చేస్తూంటే కుటుంబంలోని వారే వ్యతిరేకిస్తూ వుంటారు, సహకరించరు. మరి కొంతమందికి ఆర్థిక ఇబ్బందులు వస్తూంటాయి. అందువల్ల ఇలాంటి కారణాలతో చాలా మంది ధ్యాన సాధన కొనసాగించలేకపోతారు. సాధన ఆపేయడం కూడా జరుగుతుంది.

కానీ కొంతమంది ఎన్ని ఇబ్బందులు కలిగినా పట్టుదలగా సాధన కొనసాగించగలిగినా, ఆహార నియమాలు పాటించలేకపోతారు. కారణం సమాజంలో ఆహారం గురించి శ్రద్ధ తీసుకునే వారు, ఆహార నియమాలు పాటించే వారు ఎవరూ లేకపోవడమే. ఎంతసేపూ రుచికి ప్రాధాన్యం ఇవ్వడం వల్ల ఈ పరిస్థితి ఏ్పడింది. ఎందుచేతనంటే సమాజంలో తీసుకునే ఆహారం ఎక్కువగా తమో గుణం, రజోగుణం కలిగించేవే వున్నాయి. అందుచేత సాధన చేసే వారు సాత్వికమైన శాకాహారం తీసుకుందామన్నా సాధ్యం కాదు. వారికి ఇంట్లోనే సహకారం వుండదు. ఒకవేళ ఇంట్లో ఏదో విధంగా జాగ్రత్తపడినా, ఫంక్షన్స్, పార్టీలకు వెళ్ళినపుడు, ప్రయాణాలు చేసినపుడు ఆహార నియమాలు పాటించలేకపోతూంటారు. కారణం వండేది శాకాహారమే అయినా ఎక్కువ తమోగుణం, రజోగుణం కలిగించే ఆహారాలే వుంటాయి. అందుచేత ఎన్నో ఇబ్బందులు అధిగమించి తీవ్ర సాధన చేసి మనస్సు శుద్ధి చేసుకున్నా ఆహార లోపం వల్ల మరల మామూలు స్థితికి చేరుకుంటున్నారు. నెలల తరబడి, సంవత్సరాల తరబడివ చేసిన సాధనంతా వృధా చేసుకుంటారు. మరల మొదటికి వస్తారు. అంటే ప్రారంభ స్థితిలోనే వుంటారు. దీనిని బట్టి సాధనలో పురోగతి

సాధించడం ఎంత కష్టమో మనం అర్థం చేసుకోవచ్చు.

దీనిని బట్టి ధ్యాన సాధనలో పురోగతి సాధించడం సామాన్య విషయం కాదని అర్థమవుతుంది. అందుచేత ఒకవేళ ఎవరైనా వీటన్నిటిని అధిగమించి పురోగతి సాధించగలిగితే వారు చాలా గొప్పవారని మనం అర్థం చేసుకోవచ్చు.

అందుకే పూర్వం గురువులు ఈ జ్ఞాన మార్గాన్ని బోధించడానికి ముందు శిష్యులకు ఎన్నో కఠోర పరీక్షలు పెట్టేవారు. ఆ పరీక్షలు తట్టుకుని నిలబడిన శిష్యులకు మాత్రమే ఈ మార్గాన్ని బోధించేవారు. మిగిలిన వారికి బోధించినా ప్రయోజనం వుండదని వారికి తెలుసు. ఆధ్యాత్మికంగా ఎదగాలన్నా, జ్ఞానాన్ని సంపాదించాలన్నా, చాలా చాలా కష్టపడాలని వారికి తెలుసు.

అందుకే అటువంటి వారిని ఆశ్రమాలలోనే వుంచి ఆహార నియమాలు పాటింప చేస్తూ... వారి చేత సాధనలు చేయించేవారు. రోజూ కొంతసేపు వారిచేత జ్ఞానవంతమైన పుస్తకాలు చదివించేవారు. వారి స్థాయిని బట్టి కావలసిన జ్ఞానాన్ని బోధించే వారు, సందేహాలు నివృత్తి చేసేవారు. అందువల్ల వారు అచిర కాలంలోనే సాధనలో పురోగతి సాధించడమే కాదు, ఆధ్యాత్మికంగా ఎదిగేవారు. జ్ఞానాన్ని కూడా వృద్ధి చేసుకునే వారు. ఇదంతా వారు ఎందుకు చేసేవారంటే? సాధన చెయ్యడం సాధనలో పురోగతి సాధించడం. ఆధ్యాత్మికంగా ఎదగడం. బుద్ధిని, జ్ఞానాన్ని సంపాదించుకోవడం సామాన్యమైన విషయం కాదు, అంత తేలికైన విషయం కాదని వారికి తెలుసు.

అంతటి కష్టసాధ్యమైన సాధనను ప్రస్తుతం పత్రీజీ అందరికీ బోధించడానికి కారణం భూ మండలంలో ఇప్పుడు మార్పులు జరుగుతున్నాయి. భూమి ఫోటానుబాండులో ప్రవేశిస్తుంది. కలియుగం పోయి 2012 నుంచి సత్యయుగం ప్రారంభమయ్యింది. సత్యయుగంలో ప్రవేశించిన ప్రతి ఒక్కరూ సత్యయుగ లక్షణాలు సంపాదించుకోవలసిన అవసరం వుంది. దానికి ప్రతి ఒక్కరూ తప్పనిసరిగా మాంసాహారం వదలి, ధ్యానం చెయ్యవలసిన అవసరం వుంది. అందుకే పత్రీజీ వూరూరా తిరుగుతూ, అన్ని రాష్ట్రాలలో, అన్ని దేశాలలో అహింసా ప్రచారం, ధ్యాన ప్రచారం చేస్తున్నారు. మాంసం మాన్పిస్తున్నారు, అందరిచేత ధ్యానం చేయిస్తున్నారు, ధ్యానయజ్ఞాలు ఏర్పాటు చేసి లక్షలాది మంది చేత ధ్యానాన్ని చేయిస్తున్నారు. అందరిలో మార్పు తీసుకు రావటానికి

విశేషంగా కృషి చేస్తున్నారు. ప్రస్తుత పరిస్థితుల్లో అంటే ప్రస్తుత యుగంలో ప్రతి ఒక్కరూ ఎంత కష్టమైనా ఈ సాధన చెయ్యవలసిందే, ప్రవర్తనలో మార్పు తెచ్చుకోవలసిందే! తప్పదు.

అందుచేత ధ్యానం చెయ్యడానికి ఎందుకు ఇంత కష్టపడాలి? అంటే కష్టపడకుండా వుండటానికే. ఎందుచేతనంటే గోరంత ధ్యాన కష్టం, కొండంత జీవిత కష్టాలు లేకుండా చేస్తుంది. కాబట్టి అందుచేత కష్టపడేది కష్టాలు లేకుండా చేసుకోవడానికే.

ఏది ఏమైనా, ఎవరైనా సరే మొదటి స్థితిని తప్పనిసరిగా దాటాలి. తమో, రజోగుణాలు తొలగించుకుని సాత్విక గుణంలోకి ప్రవేశించాలి. దానికి మనస్సు శుద్ధి చేసుకోవాలి.

కనీసం మానవుడు జీవితంలో ఈ రెండవ స్థితికైనా చేరుకోవడానికి ప్రయత్నించాలి. అంటే మనస్సు శుద్ధి చేసుకోవాలి. కారణం ఈ స్థితికి చేరుకున్న వారు మనస్సులోని మాలిన్యం పోవడం వల్ల తప్పులు, పాపాలు చెయ్యరు. సృష్టి విరుద్ధమైన పనులు చెయ్యరు. అందువల్ల భవిష్యత్తులో కష్టాలు రావు. వీరిని 'కర్మసిద్ధాంతం' నష్టపరచదు. పైగా మనస్సు శుద్ధి కావడం వల్ల మంచి పనులు, లోక కళ్యాణకరమైన పనులు అంటే పుణ్యకర్మలే చేస్తారు. అందువల్ల వారికి భోగాలే కలుగుతాయి. లాభాలే వస్తాయి. అందుచేత ఆనందంగా జీవించగలుగుతారు.

అసలు ఈ స్థితికి వచ్చిన వారు తరువాత స్థితి గురించి ప్రత్యేకించి ప్రయత్నించవలసిన అవసరం వుండదు. కారణం ఈ స్థితిలో వారికి బుద్ధి వికసిస్తుంది. అందుచేత వారి బుద్ధే వారిని తరువాత స్థితికి తీసుకు వెళ్తుంది. అంతేకాదు ఈ స్థితిలో వున్న వారికి పెద్దగా ఎవరూ ఏమీ చెప్పవలసిన అవసరం వుండదు, భోధించవలసిన అవరం వుండదు. కారణం బుద్ధి వికసించడం వల్ల వివేకం కలుగుతుంది. తద్వారా విచక్షణా జ్ఞానం ఏర్పడుతుంది. అందువల్ల వారికి ఏది మంచో?–ఏది చెడో? ఏది న్యాయమో?–ఏది అన్యాయమో? ఏది ధర్మమో?–ఏది అధర్మమో? ఏది సత్యమో?–ఏది అసత్యమో? అన్న తేడా తెలుస్తుంది.

అందుచేత అధర్మమయిన పనులు చెయ్యరు. ధర్మంగానే వ్యవహరిస్తారు.

అసత్యాన్ని ఆశ్రయించరు. సత్యాన్నే ఆశ్రయిస్తారు. చెడును పూర్తిగా వదిలివేస్తారు. మంచినే ఆశ్రయిస్తారు. కారణం తన వివేకంతో ఈ తేడా తెలుసుకుంటారు. అందుచేత జీవితంలో అన్నీ లాభాలే పొందుతారు. తరువాత స్థితికి చేరుకోవడానికి ప్రయత్నిస్తారు. అంటే జ్ఞానం పొందడానికి ప్రయత్నిస్తారు. అనతి కాలంలోనే ఆ స్థితికి చేరుకుంటారు. అందుచేత ఎవరైనా సరే మొదటి స్థితి నుంచి రెండవ స్థితికి చేరాలి. అంటే నిశ్చలమైన మనస్సును నిర్మలం చేసుకోవాలి, అంటే శుద్ధి చేసుకోవాలి. ఈ స్థితి కోసం తీవ్రంగా కృషి చెయ్యాలి.

## శుద్ధమయిన మనస్సు శూన్యమవుతుంది

అంతేకాదు సాధన అదే స్థాయిలో నెలల తరబడి, సంవత్సరాల తరరబడి కొనసాగించగలిగితే శుద్ధమైన మనస్సు మెల్లిగా శూన్యమవుతూ వుంటుంది. మనస్సు మెల్లిగా శూన్యమవుతూ వుంటే ఆత్మకు దగ్గరవుతూ వుంటారు. అంటే ఆత్మ స్థితి పొందుతూ వుంటారు. అపుడు వారిలో జ్ఞానం ఉదయిస్తూ వుంటుంది. అలా జ్ఞానం ఉదయించే కొద్దీ వారి పనులలో చాలా మార్పులు కనిపిస్తాయి. బుద్ధి ద్వారా తెలుసుకున్న ధర్మాన్ని ఆచరిస్తారు. సత్యాన్నే చెబుతూ వుంటారు. అంటే వేదాలలో బోధించబడిన “సత్యం వధ, ధర్మం చర” అన్న సందేశం ఈ స్థితిలో ఆచరణలోకి వస్తూ వుంటుంది.

మనస్సు ఇంకా శూన్యమయ్యే కొద్దీ ఆత్మకు ఇంకా దగ్గరవుతూ వుంటారు. మనస్సు ఎంత శూన్యమవుతే ఆత్మకు అంత దగ్గర కాగలుగుతారు. ఆత్మకు దగ్గరయ్యే కొద్దీ వారిలో ఆత్మకు సంబంధించిన జ్ఞానం కలుగుతుంది. అలా జ్ఞానం పెరిగే కొద్దీ ఎన్నో తెలియని విషయాలు తెలుసుకుంటూ వుంటారు. ఆత్మ లక్షణాలు ఏర్పడుతూ వుంటాయి. ఆత్మ శక్తులు మెల్లిగా సంక్రమిస్తూ వుంటాయి.

అలా ఆత్మజ్ఞానం కలిగే కొద్దీ వారి కర్మలు దగ్ధమవుతూ వుంటాయి. కర్మలు దగ్ధమయ్యే కొద్దీ కష్టాలు తగ్గుతూ వుంటాయి. అలా ముందు ప్రారబ్ద కర్మలు దగ్ధమవుతాయి. నెమ్మదిగా వర్తమాన కర్మలు కూడా దగ్ధమవుతూ వుంటాయి. జ్ఞానం పెరిగే కొద్దీ సంచిత కర్మలు కూడా దగ్ధమవుతూ వుంటాయి.

అలా జ్ఞానం ప్రజ్వరిల్లే కొద్దీ అంటే పెరిగే కొద్దీ వారి మొత్తం కర్మలు దగ్ధమవుతాయి. “జ్ఞానాగ్ని దగ్ధకర్మాణాం” అని గీతలో చెప్పబడింది కదా?

అలా కర్మలన్నీ దగ్ధం చేసుకున్నవారు దుఃఖం నుంచి బయటపడినట్టే. అంటే కష్టాల నుంచి ముక్తి పొందినట్టే.

అంతేకాదు ఆత్మకు దగ్గర అయ్యే కొద్దీ ఆత్మ లక్షణాలు ఏర్పడుతూ వుంటాయి. ఆత్మ అంటే సాక్షాత్తూ భగవంతుడు కాబట్టి వారికి ఆ లక్షణాలు కలుగుతూ వుంటాయి. ఆత్మ నిత్యానంద స్వరూపం కాబట్టి ఆ స్థితి పొందేవారు వారికి తెలియని ఆనందానుభూతిని అనుభవిస్తూంటారు. ఆత్మ ప్రేమ స్వరూపం కాబట్టి వారు అందరిని ప్రేమించగలుగుతారు. వారిలో మెల్లిగా ఈర్ష్య, ద్వేషం, అసూయ తగ్గిపోతుంది. సకల జీవులను ప్రేమించగలుగుతారు. ఆత్మ అంటే భగవంతుడు కాబట్టి. ఆ స్థితి పొందే వారికి కోరికలు తగ్గిపోతాయి. ఉన్న దానితో తృప్తి పడతారు. భోగాలు మీద ఆసక్తి తగ్గుతూ వుంటుంది. సంపదల మీద వ్యామోహం తగ్గుతుంది.

ధర్మం బోధపడుతుంది. ధర్మం యొక్క గొప్పతనం తెలుస్తుంది. ధర్మాన్ని ఆచరిస్తారు. ధర్మాన్ని ఆచరించటానికి భయపడరు, సత్యం అవగతమవుతుంది, సత్యం యొక్క గొప్పతనం తెలుస్తుంది. అందుచేత సత్యంలోనే జీవిస్తారు, సత్యాన్నే బోధిస్తారు. సత్యాన్నే చెపుతారు. సత్యం చెప్పడానికి వెనుకాడరు.

ఏ విషయంలోనైనా ధైర్యంగా వ్యవహరించగలుగుతారు. భయం తొలగిపోతుంది. అనంత శక్తి కలిగిన ఆత్మకు దగ్గరవుతూ వుండటం వల్ల వారిలో శక్తి పెరుగుతూ వుంటుంది. పనులు శక్తివంతంగా చేయగలుగుతారు. అసాధ్యమైన పనులు కూడా సునాయాసంగా చేయగలుగుతారు.

వారిచేతలు శక్తివంతంగా వుంటాయి. వారి మాటలు కూడా శక్తివంతంగా వుంటాయి. వారు చేసే పనులు అందరికీ ఆదర్శవంతం అవుతాయి. వారు చెప్పే మాటలు ఇతరులను ప్రభావితం చేస్తాయి. ఎంతోమంది వారిని అనుసరిస్తూ వుంటారు. వారు చేసే పనులు, వారు చెప్పే మాటలపై ఆసక్తి కనపరుస్తూ వుంటారు. ఒక రకంగా ఎంతో మంది వారి అడుగు జాడల్లో నడుస్తూ వుంటారు.

నేనే అంతా! అంతా నేనే! అన్న సత్యం అవగతమవుతుంది. అంతా ఒక్కటే అని తెలుసుకుంటారు. అందుచేత అందరితో స్నేహంగా మెలుగుతారు. ఆఖరికి పక్షులు, జంతువులే కాదు, క్రూర జంతువులతో కూడా స్నేహంగా

వుండగలుగుతారు. అన్నిటి మీద దయ, కరుణ చూపిస్తూ వుంటారు. వేటినీ హింసించరు, వేటిని బాధించరు. అన్నిటిని రక్షిస్తారు.

లోకంలో ఈ సత్యం తెలియక ఇతరులు, ఇతర జీవులు వేరనుకుంటూ, వారి విషయంలో తప్పులు, పాపాలు చేస్తూ వాటి ఫలితం కష్టాల రూపంలో అనుభవిస్తూ, ఆనందం కోల్పోయిన వారి ఆనందం కోసం, వారి బాగు కోసం కృషి చేస్తారు తనకంటే ఇతరుల బాగుకు, ఆనందానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తుంటారు.

వీరికి మెల్లిగా ఆత్మ శక్తులు అంటే అతీంద్రియ శక్తులు సంక్రమిస్తూ వుంటాయి. అతీంద్రియ జ్ఞానం కూడా కలుగుతూ వుంటుంది. సామాన్యులు చేయలేని పనులు చేస్తూ వుంటారు. చెప్పలేని విషయాలు చెపుతూ వుంటారు. వారు చేసే పనులు, చెప్పే మాటలు అందరినీ ఆశ్చర్య చకితులను చేస్తాయి. వీరు సామాన్యులు కాదు, దైవాంశ సంభూతులు అని సామాన్యులు పొగుడుతూ వుంటారు, కొనియాడుతూ వుంటారు, దేవుళ్ళని ఆరాధనలు చేసే వారు కూడా వుంటారు.

ఈ స్థితిలో వీరికి ఎన్నో రకాల అనుభవాలు కలుగుతూ వుంటాయి. వాటి వల్ల వారి జ్ఞానం ఇంకా పెరుగుతూ వుంటుంది.

వారి మనస్సు ఇంకా శూన్యమయ్యే కొద్దీ వారి ఆత్మ స్థితి పెరుగుతూ వుంటుంది. అలా ఆత్మస్థితి పెరిగే కొద్దీ వారిలో పై లక్షణాలన్నీ పెరుగుతూ వుంటాయి. మెల్లిగా వారికి అణిమ, మహిమ, గరిమ, లఘిమ లాంటి సిద్ధులు కూడా కలుగుతాయి. ఈ స్థితిలో రకరకాల శక్తులు కూడా కలగవచ్చు. వీరికి దివ్యనేత్ర అనుభవాలు కూడా కలుగవచ్చు. అటువంటి వారు భవిష్యత్తులో జరగబోయే విషయాలు తెలుసుకుంటూ వుంటారు. ఎదుట వారు ఏమనుకుంటున్నారో కూడా తెలుసుకోగలుగుతారు. సృష్టిలో జరిగే విషయాలు కూడా కొన్ని తెలుసుకోగలుగుతారు.

ఇటువంటి శక్తులు కానీ, సిద్ధులు కానీ పొందిన వారిలో కొంతమంది వాటిని ప్రదర్శిస్తూ సామాన్యుల దగ్గర తాము దైవాంశ సంభూతులన్నట్టుగా ప్రవర్తిస్తారు. వాటిని ప్రదర్శిస్తూ సామాన్యులను ఆకర్షిస్తారు. వశం చేసుకుంటారు. మెల్లిగా వారి మీద ఆధిపత్యం సాధించి వారి ద్వారా సంపదలు పెంచుకుంటారు.

భోగాలు అనుభవిస్తూ వుంటారు. అలా భోగాలలో మునిగి చివరకు తమ లక్ష్యమేమిటో మరచిపోతారు. అహంకారంతో తమకు సంక్రమించిన శక్తులను జ్ఞానవృద్ధికి ఉపయోగించకుండా తమ స్వార్ధానికి ఉపయోగించడం వల్ల చేయకూడని పనులు చేయడం వల్ల, సృష్టి విరుద్ధంగా ప్రవర్తించడం వారు సంపాదించుకున్న శక్తులన్నీ కోల్పోవడం జరుగుతుంది. తిరిగి మామూలు స్థితికి చేరుకుంటారు.

కానీ ఎవరైతే తమకు సంక్రమించిన శక్తులను ప్రాపంచిక భోగాలకు, స్వార్ధానికి ఉపయోగించకుండా జ్ఞానవృద్ధికి ఉపయోగిస్తారో వారు ఆధ్యాత్మికంగా ఆత్మపరంగా ఇంకా ఇంకా ఎదుగుతారు. తమ జ్ఞానాన్ని ఇంకా పెంచుకోగలుగుతారు. ఇటువంటి వారు భోగాల మీద దృష్టి వుంచరు. సాధన మీదే దృష్టి వుంచుతారు. వారి సాధన ఏ స్థాయికి చేరుకుంటుందంటే అలా నిరంతరాయంగా అంటే కూర్చున్నవారు లేవకుండా ధ్యాన స్థితిలో వుండిపోతారు.

అలా వుండటం వల్ల వారి మనస్సు పూర్తిగా శూన్యమైపోతుంది. ఒక రకంగా కాలిపోయిన తాడులా తయారవుతుంది. అంటే కాలిపోయిన తాడు చూడటానికి తాడులా వుంటుంది కానీ ఏ రకమైన పట్టు వుండదు. పట్టుకుంటే చేతికి దొరకదు. ఒక రకంగా వున్నా లేనట్టే లెఖ్ఖ. దీనినే ఆత్మస్థితి అంటారు. అంటే దైవస్థితి అని చెప్పుకోవచ్చు. ఆత్మ సాక్షాత్కార స్థితి అని చెప్పుకోవచ్చు. సమాధి స్థితి అని కూడా అంటారు. తానే దైవమని అనుభవపూర్వకంగా తెలుసుకున్న స్థితి.

ఇక్కడ మనం గమనించవలసింది ఏమిటంటే మనస్సు శూన్యమయ్యే కొద్దీ ఆత్మ స్థితి కలుగుతుంది. ఆత్మ స్థితి కలిగే కొద్దీ ఆత్మానుభవాలు, ఆత్మశక్తులు సంక్రమిస్తాయి. తద్వారా ఎన్నో తెలుసుకుంటారు, సామాన్యులు చేయలేని పనులు ఎన్నో చేయగలుగుతారు.

## ఆత్మ గురించి

ఆత్మ అన్నది సర్వత్రా వ్యాపించి వున్న అనంతమైన శక్తి, అందరిలో వున్న భగవత్ శక్తి. ఆత్మ శక్తి ఎంత గొప్పది అంటే ఈ ప్రపంచంలో వున్న కంప్యూటర్లు అన్నింటి కంటే కోట్లాది రెట్లు శక్తి గలది. ఒక రకంగా ఆత్మశక్తిని వూహించగలిగే శక్తి మానవులకు లేదనే చెప్పవచ్చు.

అటువంటి ఆత్మ ప్రతి ఒక్కరిలో వుంది. అందుచేత మానవులు చేసే పనులు, మానవుడు తెలుసుకునే, నేర్చుకునే విషయాలు ఆత్మలో రికార్డు చేయబడుతూ వుంటాయి. ఒకరకంగా మానవుడు పుట్టినప్పటి నుండి చనిపోయే వరకు ప్రతీక్షణం చేసిన పనులు, మాట్లాడిన మాటలు అన్నీ రికార్డు అవుతూ వుంటాయి. అలా ఎన్ని జన్మలు గడిచినా అన్ని జన్మలు ఆత్మలో పూర్తిగా రికార్డు చేయబడతాయి. ఒక రకంగా సి.సి. కెమెరా పెట్టినపుడు ఆ సి.సి. కెమెరా ఎదురుగా వున్న దృశ్యమంతా ఎన్ని రోజులు వుంచితే అన్ని రోజులు ఎలా రికార్డు చేస్తుందో! అలాగే ఆ ఆత్మలో వారి జన్మలన్నీ రికార్డు అవుతాయి. వారు నేర్చుకున్న జ్ఞానమంతా రికార్డు అవుతుంది. వారు నేర్చుకున్న విద్యలు, భాషలు. వారు పొందిన అనుభవాలు అన్నీ రికార్డు అవుతాయి. వారు చేసిన కర్మలన్నీ రికార్డు అవుతాయి. అలా వారి గత జన్మల వృత్తాంతమంతా పూర్తిగా ఆత్మలో నిక్షిప్తమైపోతుంది. అంతేకాదు వారి ఆలోచనలు కూడా ఆత్మకు తెలుస్తాయి. అంత శక్తి గలది ఆత్మ.

## దివ్యనేత్రం (మూడవ కన్ను)

ఆత్మశక్తి మానవ శరీరమంతా వ్యాపించి వుంటుంది. శరీరంలో ప్రతీ కణంలో కూడా వ్యాపించి వుంటుంది. ఒక రకంగా ఆత్మశక్తితోటే శరీరంలోని క్రియలు, పనులు జరుగుతున్నాయి. జీవకార్యాలు నిర్వహించబడుతున్నాయి.

ఆత్మ శరీరమంతా వ్యాపించి వున్నా కూడా ఆత్మ యొక్క కేంద్ర స్థానం మటుకు బృగు స్థానంలో వుంటుంది. అంటే నుదుట బొట్టు పెట్టుకునే భాగంలో వుంటుంది. ఆ భాగంలోనే మూడవ కన్ను వుంటుంది అంటారు. అందుకే శివుని యొక్క మూడవ కన్ను ఆ భాగంలోనే చూపిస్తారు.

మూడవ కన్నునే దివ్యనేత్రం అని కూడా అంటారు. మూడవ కన్ను అంటే ఆ భృగు స్థానంలో వేరే ఒక కన్ను ముడుచుకుని వుంటుందని భావిస్తారు. మూడవ కన్ను అంటే ప్రత్యేకమైన నేత్రం ఏమీ కాదు 'ఆత్మ'నే మూడవ కన్ను అంటారు. 'దివ్యనేత్రం' అంటారు.

మూడవ కన్ను తెరచుకోవడం అంటే ఆత్మ స్థితి పొంది ఆత్మలో రికార్డు అయినవన్నీ చూడగలగడం, తెలుసు కోవడం, వారి ఆత్మ స్థితి పెరిగే కొద్దీ వారు తెలుసుకునే విషయాలు పెరు గుతూ వుంటాయి. ఈ ఆత్మస్థితి అన్నది



మనస్సు శూన్యమయ్యే కొద్దీ కలుగుతూ వుంటుంది. అంటే దివ్యనేత్రం తెరుచుకుంటూ వుంటుంది. అంటే పని చేయడం మొదలువుతుంది. ఈ దివ్య నేత్రం మనస్సు ఎంత శూన్యమవుతే అంత ఎక్కువ పని చేస్తుంది. అంటే మూడవ కన్ను యొక్క పరిధి పెరుగుతూ వుంటుంది. అంటే తెలుసుకోగలిగిన విషయాలు పెరుగుతూ వుంటాయి.

ఈ మనో శూన్యాన్ని 3 రకాలుగా పేర్కొన్నారు. (1)శూన్యము, (2) పరిశూన్యము, (3) మహా పరిశూన్యము.

అలా మనస్సు శూన్యమయ్యే కొద్దీ వారు తెలుసుకోగలిగిన విషయాలు, సృష్టి రహస్యాల యొక్క పరిధి పెరుగుతూ వుంటుంది. ఉదాహరణకు మనస్సు శూన్యమైనప్పుడు ఆత్మస్థితి కలిగిన ప్రాథమిక దశలో మూడవ కన్ను అంటే దివ్యనేత్రం ఉత్తేజితమవడం ప్రారంభమవుతూ వుంటుంది. అటువంటి స్థితిలో వారికి గతజన్మలు, గత జన్మలలో నేర్చుకున్న విషయాలు, పొందిన జ్ఞానం స్ఫురణకు వస్తూ వుంటుంది. అలాంటి వారు ఆ విషయాలను అందరికీ చెపుతూ వుంటారు. పుస్తకాలు కూడా వ్రాస్తూ వుంటారు. సహజంగా వారు చెప్పే విషయాలు, వ్రాసేది ఎక్కడా చదవనివి, విననివి కూడా వుంటాయి. అవి చెపుతున్నప్పుడు ఇతరులకే కాదు, వారికి కూడా ఆశ్చర్యం కలుగుతుంది. వినేవారు ఆశ్చర్యపోతూ అది వారి 'పూర్వ జన్మ సుకృతం' అందుకే చెప్పగలుగుతున్నారు మనమవుతే అలా చెప్పగలమా? అని అంటారు. అనుకుంటారు కూడా.

ఇందులో రహస్యమేమీ లేదు. మనస్సు శూన్యమవ్వడం వల్ల, ఆత్మస్థితి పొందడం వల్ల, మూడవ కన్ను ఉత్తేజితమవడం వల్ల అంతకు ముందు జన్మలలో నేర్చుకున్న, పొందిన జ్ఞానం స్ఫురణకు రావడం వల్ల అలా జరుగుతుంది. అలా ఎవరికైనా జరుగుతుంది కానీ వారు మనస్సు శూన్యం చేసుకుని ఆత్మస్థితి

పొందాలి.

ఇటువంటి స్థితిలో వున్నవారు సాధన ఇంకా తీవ్రతరం చేస్తే ఆత్మ స్థితి ఇంకా పెరుగుతుంది. అపుడు వారి ఆత్మలో రికార్డు అయిన గత జన్మలన్నీ చాలా స్పష్టంగా సినిమాలో చూసినట్లు చూసుకోగలగుతారు. అంటే వారి దివ్య నేత్రం అంటే మూడవకన్ను బాగా తెరుచుకుంది అంటాం.

ఈ స్థితిలో వారు ఏఏ జన్మలలో ఎలాంటి కర్మలు చేసారు? వాటి ఫలితం తరువాత జన్మలలో ఎలా అనుభవించారు? అన్నది స్పష్టంగా తెలుసుకోగలుగుతారు. ఈ జ్ఞానం పొందడం వల్ల ఏ ఏ కర్మలు చెయ్యాలి? ఏ ఏ కర్మలు చేయకూడదు? అన్నది బాగా అవగాహనలోకి వస్తుంది. తద్వారా వారు తమ ప్రవర్తనను చాలా సరి చేసుకుంటారు. తమ జీవితంలో నష్టం కలిగించే పనులు చెయ్యరు. సృష్టి విరుద్ధమయిన పనులు చెయ్యరు. ఈ విషయాలనే ఇతరులకు బోధిస్తూ వుంటారు. వారి తప్పులు తెలియ చేస్తారు. వారు తప్పులు చేయకుండా చేస్తారు. వారు కష్టాలలో పడకుండా హెచ్చరిస్తారు. ఇదంతా ఆత్మ స్థితి పొందడం వల్ల వచ్చిన జ్ఞానం వల్ల సాధ్యమవుతుంది.

వీరు కనుక ధ్యాన సాధన ఇంకా... ఇంకా... తీవ్రంగా కొనసాగిస్తే వారి మనస్సు పరిశూన్యమవుతుంది. వారి ఆత్మ స్థితి ఇంకా విస్తరిస్తుంది. అంటే వారి మూడవ కన్ను యొక్క పరిధి ఇంకా పెరుగుతుంది. వీరి ఆత్మ ఇతరులలో వున్న ఆత్మ ఒక్కటే కావడం వల్ల ఈ స్థితిలో వీరి ఆత్మ ఇతరుల ఆత్మతతో అనుసంధానమవుతుంది. అందువల్ల వారి ఆత్మలో రికార్డు అయిన వారి గత జన్మలు కూడా తెలుసుకోగలుగుతారు. కారణం ఈ స్థితికి ఎదిగిన వారు అంటే మనస్సు పరిశూన్యం చేసుకున్నవారు ఈ రకమైన శక్తి కలిగి వుంటారు. ఇటువంటి వారిని సవికల్ప సమాధి పొందారని అంటారు.

అందుకే శ్రీ కృష్ణ భగవానుడు ఈ విషయాన్నే గీతలో చెప్పడం జరిగింది.

**శ్లో॥ బహూనిమే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।**
**తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప ॥**

**(భ.గీ. 4-5)**

తా:- ఓ అర్జునా నీకు నాకు అనేక జన్మలు గడిచాయి. అవన్నీ నాకు తెలుసు. కానీ నీకు తెలియదు.



దీనిని బట్టి శ్రీ కృష్ణునికి దివ్యనేత్రం వుందని అర్జునునకు లేదని మనం తెలుసుకోవచ్చు.

అంతేకాదు ఈ స్థితికి చేరిన వారు అంటే మనస్సు పరిశూన్యం చేసుకున్న వారు అంటే ఇతరుల ఆత్మలో రికార్డు అయిన గత జన్మలు తెలుసుకోగలిగిన వారు ఇతరుల మనస్సులో అనుకునే విషయాలు, వారి ఆలోచనలు కూడా తెలుసుకోగలుగుతారు. కారణం మనస్సులో అనుకునేవి అన్నీ ఆత్మకు తెలుస్తాయి. వారి ఆత్మ వీరి ఆత్మ అనుసంధానమవ్వడం వల్ల ఇతరులు ఏమనుకుంటున్నారో! ఏమి ఆలోచిస్తున్నారో స్పష్టంగా తెలుసు కోగలుగుతారు.

ఈ శక్తి కలిగిన వారు సామాన్యులు వారి దగ్గరకు వచ్చినపుడువారు ఏమనుకుంటున్నారో తెలుసుకోవడం వల్ల వారు అడగకుండానే వారి మనస్సులో వున్న విషయాన్ని ప్రస్తావించడం. వారి సమస్యకు అడగకుండానే పరిష్కారం చెప్పడం, ఆయన నా దగ్గరకు వస్తే బాగుండు అని అనుకునే వారి వద్దకు వెళ్ళి పలకరించడం లాంటివి చేసినపుడు సహజంగా సామాన్యులు ఆశ్చర్యపోవడం జరుగుతుంది. నా మనస్సులో అనుకున్నది, అనుకుంటున్నది వారికి ఎలా తెలిసింది? అమ్మో ఆయన నిజంగా దేవుడే? అనుకుంటూ వారి పాదాలపై పడటం చేస్తూ వుంటారు. వారు మహత్తు కలవారు అని అనుకుంటూ వారికి పూర్తిగా దాసోహం అయిపోతారు. ఇలాంటివి సహజంగా కొంతమంది బాబాలు, గురువులు విషయంలో జరుగుతూ వుంటుంది.

దీనికంతటికీ కారణం వీరి ఆత్మస్థితి విస్తరించడమే.

ఈ స్థితిలో వున్న వారు ధ్యాన సాధన ఇంకా తీవ్రాతి తీవ్రంగా కొనసాగించినట్లవుతే అంటే వారి మనస్సును 'మహా పరిశూన్యం' చేసుకున్నట్లయితే వీరి ఆత్మ సమస్త సృష్టి అంతా వ్యాపించి వున్న చైతన్యంతో కలిసిపోతుంది. అందువల్ల సృష్టి అంతా అంటే సమస్త లోకాలు వ్యాపించి వున్న ఆత్మకు సమస్త లోకాలు, సమస్త సృష్టి రహస్యాలు అన్నీ ఎలా తెలుస్తాయో! ఎక్కడ ఏమి వుంది? ఎక్కడ ఏమి జరుగుతుంది అన్నది ఎలా తెలుస్తుందో వీరిలో వున్న ఆత్మ ద్వారా వీరు కూడా సమస్త లోకాల గురించి తెలుసుకోగలుగుతారు. ఇటువంటి వారికి

తెలియనిది అంటూ వుండదు. పొందని జ్ఞానం అంటూ వుండదు. సమస్త సందేహాలు, సంశయాలు నివృత్తి చేసుకుంటారు. సమాధానాలు తెలుసుకుంటారు. ఇక వీరికి తెలియనిది అంటూ ఏమీ వుండదు. ఈ స్థితినే 'నిర్వికల్ప సమాధి' అంటారు.

ఇటువంటి స్థితికి చేరుకున్న వారు శివుని 3వ కన్ను లాంటి కన్ను పొందారని తెలుసుకోవచ్చు. ఇది సృష్టిలో అత్యుత్తమ స్థితి.

బుద్ధుడు 'ఆనాపానసతి' అంటే 'శ్వాస మీద ధ్యాస' ఉంచిన మొదటి జాములోనే మనస్సు శూన్యమై తన జన్మ పరంపర అంతా చూసుకోగలిగారు. ఆయన ధ్యాన సాధన ఇంకా అలాగే కొనసాగించినపుడు రెండవ జాములో మనస్సు పరిశూన్యమై అందరి జన్మ పరంపరలు తెలుసుకోగలిగాడు. తన సాధనను ఇంకా కొనసాగించి మూడవ జాములో మహా పరిశూన్య స్థితికి



చేరుకున్నప్పుడు సమస్త సృష్టి గురించి తెలుసుకోగలిగాడు, బుద్ధుడు కాగలిగాడు, పూర్ణ జ్ఞానాన్ని పొందగలిగాడు.

ఈ స్థితి పొందిన వారు పూర్తిగా దైవంలా ప్రవర్తిస్తారు. అంటే మానవుడు మాధవుడుగా మారిన స్థితి. నరుడు నారాయణుడుగా మారిన స్థితి. ఈ స్థితిలో వారి మూడవ కన్ను సంపూర్ణంగా తెరచుకుంటుంది. పరమశివుని మూడవ కన్నులా వుంటుంది. అందువల్ల సమస్త సృష్టిలోని సమస్త లోకాలకు సంబంధించిన పూర్ణజ్ఞానం వారికి కలుగుతుంది. ఇటువంటి వారిని బ్రహ్మజ్ఞాని అంటారు. దీని పూర్ణ జ్ఞానంతో సృష్టిలోని సమస్త లోకాల గురించి తెలుసుకోగలుగుతారు. ఇక సృష్టిలో వారికి తెలియంది అంటూ ఏమీ వుండదు. సంపూర్ణ అవగాహన వుంటుంది. వీరికి సమస్త శక్తులు సంక్రమిస్తాయి. ఎటువంటి శక్తి అంటే సృష్టికి ప్రతి సృష్టి చెయ్యగలుగుతారు. వీరిని బ్రహ్మర్షులంటారు. పూర్ణాత్మ అని కూడా అంటారు.

ఆ రకంగా సామాన్య మానవుడుగా ప్రారంభమైన జీవితం ధ్యానం ద్వారా బ్రహ్మజ్ఞానం సంపాదించుకుని బ్రహ్మర్షిగా, పూర్ణాత్మగా, కోక్రియేటర్‌గా

ఎదుగుతారు, ఇదంతా ధ్యానం వల్లనే సాధ్యమవుతుంది. అందువల్ల "ధ్యానం వల్లనే జ్ఞానం" అని చెప్పడం జరిగింది.

### "జ్ఞానాన్ని తేలికగా పొందగలమా?"

ఆసక్తి, పట్టుదల, కృషి వుంటే జ్ఞానాన్ని ఎవరైనా తేలికగా పొందవచ్చు. అవి లేకుండా జ్ఞానం పొందాలనుకునే వారికి ప్రతీది, ప్రతి విషయంలో కష్టంగానే కనిపిస్తుంది, కష్టమే అవుతుంది. ఎందుచేతనంటే అలాంటి వారికి జ్ఞానం పొందడం అంత తేలికైన విషయం కాదు. కారణం ప్రారంభంలో చెంచలమైన మనస్సును నిశ్చలం చేసుకోవాలి. మనస్సు నిశ్చలమవుతేనే 'ధ్యానస్థితి'ని పొందినట్టు. అలా మనస్సును నిశ్చలం చేసుకోవడమే చాలా చాలా కష్టం. ఎందుచేతనంటే మనస్సు ఒక పట్టాన అంత తేలికగా లొంగదు. మనం ఒకటి చెపుతే అది ఇంకొకటి చేస్తుంది. మనం చెప్పింది చెయ్యడం దాని లక్షణం కాదు. ఇంకా గమనిస్తే మనం ఏది వద్దంటే అదే చేస్తుంది. ఏది చెయ్యమంటే అది చెయ్యదు.

అందుకే మీరు చూడండి మనం శ్వాసను గమనించమంటే వూరికే రెండు మూడు శ్వాసలు గమనిస్తుంది. వెంటనే మనకు తెలియకుండానే వేరొక ఆలోచనలోకి వెళ్ళిపోతుంది. సహజంగా మనం ఇది గమనిస్తూనే వుంటాం. చూడండి మనకు దుఃఖం కలిగించే ఆలోచనలు వచ్చినపుడు సహజంగా దుఃఖపడుతూ వుంటాం. బాధపడతాం. ఆ బాధ భరించలేక వేరే ఇంకొకరకమైన విషయాలు ఆలోచిద్దామనుకున్నా మనస్సు మరల అదే ఆలోచనలను గుర్తు చేస్తూ వుంటుంది. అలాంటి ఆలోచనలు వున్నవారు చాలా మంది రాత్రిళ్ళు నిద్రపట్టక చాలా ఇబ్బంది పడతారు. అటువంటి వారు డాక్టర్లను సంప్రదిస్తే నిద్రమాత్రలు వేసుకోమంటారు. అలా నిద్రమాత్రలు వేసుకుంటేనే కానీ వారికి నిద్రపట్టదు. ఈ పరిస్థితికి కారణం మనస్సు వద్దన్న ఆలోచనలను గుర్తు చెయ్యడమే. అది మనస్సు యొక్క సహజ గుణం.

మనస్సు మనం ఒకటి చెపుతే ఇంకొకటి చేస్తుంది అన్నది తెలుసు కోవటానికి చిన్న ఉదాహరణ చూద్దాం.

అందరికీ కోతి గురించి తెలుసు. ఇప్పటి దాకా మీకు కోతి ప్రస్తావన లేదు. కోతి గురించి ఆలోచనా లేదు. కానీ ఇప్పుడు మీరు ఇప్పుడు కళ్ళు

మూసుకుని మూడు నిమిషాలు కోతి తప్ప ఇక ఏదైనా ఆలోచించడానికి ప్రయత్నించండి. ఖచ్చితంగా మీకు ఆశ్చర్యం కలుగుతుంది. ఇప్పటి దాకా కోతి ప్రస్తావనే లేని మీకు కళ్ళు మూసుకున్న దగ్గర నుంచి కోతే గుర్తుకు వస్తుంది. అంటే మనస్సు కోతినే గుర్తు చేస్తుంది. అంటే వద్దన్న పనే చేస్తుంది.

దీనిని బట్టి మనస్సు మన చెప్పు చేతల్లో వుండదని స్పష్టంగా అర్థమవుతుంది. అటువంటి మనస్సును అదుపు చెయ్యడం అంత తేలికైన విషయం కాదు, అంటే ఆలోచించకుండా మనస్సును వుంచడం, చాలా చాలా కష్టమని తెలుసుకోవాలి అంటే ఆలోచనలు లేని 'ధ్యాన స్థితి' పొందడం ఎంత కష్టమో అర్థం చేసుకోవచ్చు. మొదటి స్థితి సాధించాలంటేనే అంటే మనస్సు నిశ్చలం చేసుకోవాలంటేనే ఎంత కష్టపడాలో అర్థం చేసుకోవచ్చు.

ఒకవేళ కష్టపడి ఎక్కువ గంటలు కూర్చుంటూ ఆ స్థితి సాధించి ఒకే సిట్టింగులో ఎక్కువ గంటలు కూర్చోగలిగినా ప్రాపంచిక బాధ్యతలు, సంసారిక ఇబ్బందుల వల్ల, సాధనకు మధ్యమధ్యలో అవరోధాలు కలుగుతుంటాయి. అలా అవరోధాలు కలిగినట్లయితే అంటే అనునిత్య సాధన చేయలేక పోయినట్లయితే మరల మొదటికి వచ్చే ప్రమాదముంది. అటువంటి పరిస్థితుల్లో మరల అదే స్థితికి చేరుకోవటానికి ఎంత కష్టపడాలి? అలా మొదటి నిశ్చల స్థితికి చేరుకోవడమే అంత కష్టమయినప్పుడు ఇక రెండవ నిర్మల స్థితికి ఎప్పుడు చేరుకుంటారు? ఆలోచించండి? అంటే మనస్సుని అదుపు చేయడం, నిగ్రహించటం ఎంత కష్టమో తెలుసుకోవచ్చు.

అందుకే గీతలో అర్జునుడు ఈ విషయాన్నే శ్రీ కృష్ణ భగవానుని అడగడం జరిగింది. ఎంత ప్రయత్నించినా మనస్సును నిగ్రహించడం కష్ట సాధ్యంగా వుంది? ఏం చెయ్యాలి? అని అడిగినపుడు శ్రీ కృష్ణుల వారు "అభ్యాస, వైరాగ్యాలచే సాధించవచ్చు" అని చెప్పడం జరిగింది.

'అభ్యాసం' అంటే అను నిత్య సాధన చెయ్యాలి. 'వైరాగ్యం' అంటే అన్నిటిని వదిలిపెట్టి ఎక్కడికో వెళ్ళిపోవడం కాదు. సంసారంలో వుంటేనే అన్నిటి మీద మమకారం వదలడం అంటే సంసారం చేసుకోవచ్చు. కానీ పిల్లల మీద, భార్య మీద, భర్త మీద మమకారం వుండకూడదు. వారిని పోషించాలి కానీ వారికి ఏదైనా జరిగితే విలవిలలాడిపోకూడదు. నేను బ్రతికి ప్రయోజనమేమిటి?

నేను ఉండను, చచ్చిపోతాను లాంటి మాటలు రాకూడదు.

అలాగే ధనం సంపాదించుకోవచ్చు. కానీ ధనం మీద మమకారం వుండకూడదు, వుంటే తప్పులు, పాపాలు చేస్తారు. అధర్మ మార్గాలు అనుసరిస్తారు. కానీ మమకారం లేనివారు న్యాయంగా, ధర్మంగా సంపాదిస్తారు. ఉన్నదానితో తృప్తి పడతారు.

కానీ ఇక్కడ మనం గమనిస్తే ప్రాథమిక స్థాయిలో ధ్యానం చేసేవారు. మమకారం లేకుండా ఎక్కడ వున్నారు? సాధన చేస్తే చెయ్యవచ్చు కానీ మమకారం వదలలేదు కదా? మరి మనస్సును ఎలా నిగ్రహిస్తారు? ఎలా అదుపు చేస్తారు? మొదటి స్థితి నుంచి రెండవ స్థితికి ఎలా చేరుకుంటారు?

అభ్యాసం గురించి వశిష్ఠుల వారు ఈ విధంగా చెప్పడం జరిగింది. "బ్రహ్మమును అంటే ఆత్మను గూర్చి చింతన చేయడం దానినే ఇతరులకు చెప్పడం, పరస్పరం దాని గూర్చే ప్రబోధించడం, దీనిలోనే నిష్ట కలిగి వుండటం, దీనినే విజ్ఞులు అభ్యాసమని చెప్పారు".

అందుచేత 'జ్ఞానం పొందాలనుకునేవారు ఎంత కష్టపడాలో అర్థం చేసుకోవచ్చు. అందుకే ఎంత మందిని చూసినా ప్రారంభ స్థితిలోనే వుంటున్నారు కానీ రెండవ స్థితికి చేరలేకపోతున్నారు. మనస్సు శుద్ధి చేసుకోలేకపోతున్నారు, గుణాలు మార్చుకోలేకపోతున్నారు, ప్రవర్తన మార్చుకోలేకపోతున్నారు, పనులు మారట్లేదు, ఫలితాలు అంతకు ముందులాగే వుంటున్నాయి. కొన్ని సమస్యలు పరిష్కారమయినా మరల సమస్యలు వస్తున్నాయి.

కానీ జ్ఞానం పొందాలనే కాంక్ష వుండి ఏదో రకంగా కష్టపడి ఎక్కువ గంటలు ధ్యానంలో కూర్చుంటే మొదటి స్థితి సాధిస్తారు. అంటే మనస్సు నిశ్చలపరచుకుంటారు. అలా గంటలు, గంటలు, రోజుల తరబడి, నెలల తరబడి సాధన చేస్తుంటే నెమ్మదిగా వారి మనస్సు శుద్ధి అవుతూ వుంటుంది.

అలా కష్టపడి సాధన చేసే వారి మనస్సు ఎంత శుద్ధత పొందినా! వారికి ఆహారం విషయంలో చాలా ఇబ్బందులు ఎదురవుతాయి. ఎందుచేతనంటే సాధన చేసేవారు సంసార జీవితంలో వుండడమే కాదు సమాజంలో అనేక రకాలైన వారితో జీవించవలసి వుంటుంది, వ్యవహారాలు నడపవలసి వుంటుంది, ఎన్నో మొహమాటాలు వుంటాయి, ఎన్నో ఒత్తిడులు వుంటాయి. అటువంటి

సందర్భంలో ఇంట్లో ఆహార నియమాలు పాటించగలిగినా బయటకు వెళ్ళినపుడు, ఫంక్షన్సుకు వెళ్ళినపుడు ఎక్కడో ఒక చోట తనకు తెలియకుండానే నియమం తప్పవలసి వస్తుంది. అపుడు వారికి తెలియకుండానే ఇంత కష్టపడి శుద్ధి చేసుకున్న మనస్సు మరల మలినమైపోతుంది. అంటే వారి గుణం మలినంగా మారిపోతుంది.

వారికి మనస్సు మలినమైనట్టు కానీ గుణం మారినట్టు కానీ ఏమీ తెలియదు. తాము తీవ్రంగా సాధన చేస్తున్నాము, సాధనలో పురోగతి సాధిస్తున్నామని భావిస్తూంటారు, ఎదుగుతున్నామని అనుకుంటారు. కానీ మొదటికి వచ్చిన సంగతి గ్రహించలేరు. దీనిని బట్టి సాధన చేసే వారికి ఆహార నియమాలు ఎంత ముఖ్యమో అర్థం చేసుకోవచ్చు. ఎందుచేతనంటే ఆహారం యొక్క ప్రభావం మనసు మీద కూడా వుంటుంది.

ఆలోచించండి ఇటువంటి సమాజంలో ఎన్ని ఆటంకాలు? ఎన్ని ప్రలోభాలు? ఎన్ని ఒత్తిళ్ళు? ఎన్ని మొహమాటాలు? చాలా మందికి ఇంటిలోనే సహకారం లభించదు. ఇక సాధనలో ఎలా పురోగతి సాధిస్తారు? మనస్సు శు ద్ధి ఎలా చేసుకోగలుగుతారు?

ఈ రెండవ స్థితి దాటలేని వారు మూడవ స్థితికి ఎలా చేరుకుంటారు? అంటే మనస్సు శుద్ధత పొందకపోతే శూన్యం ఎలా అవుతుంది? మనస్సు శు ద్ధి చేసుకోవడమే కష్టమవుతే మనస్సు శూన్యం చేసుకోవడం ఎంత కష్టం? సామాన్య సాధకులకు ఎలా సాధ్యమవుతుంది?

ఈ ధ్యాన మార్గంలోకి వచ్చిన వారు ఎక్కువ శాతం లాభాకాంక్షతో వచ్చిన వారే కానీ తీవ్ర జ్ఞాన కాంక్ష వున్నవారు కాదు కదా? మరి వారికి తీవ్ర సాధన చెయ్యాలని, ఆహార నియమాలు పాటించాలనే పట్టుదల ఎలా వుంటుంది? ఎంతసేపూ చేసే సాధన కంటే వచ్చే లాభాలు మీదే ఎక్కువ దృష్టి వుంటుంది. అంటే రోగం తగ్గిందా? లేదా? కోరిక తీరిందా? లేదా? సమస్య పోయిందా? లేదా? అన్న దాని మీద దృష్టి వుంఉటంది. కానీ మనస్సు శు ద్ధమయ్యిందా? శూన్యమయ్యిందా? అన్న ఆలోచన ఎక్కడ వుంటుంది? వారికి వచ్చే లాభాలే ముఖ్యం.

ఇటువంటి వారికి జ్ఞానం ఎలా వస్తుంది చెప్పండి? జ్ఞానకాంక్ష తీవ్రంగా

వున్నవారికే జ్ఞానం వస్తుంది కానీ లాభ కాంక్ష వున్నవారికి జ్ఞానం ఎలా వస్తుంది? ధ్యానం వల్లనే జ్ఞానం అంటే వూరికే కొద్ది రోజులు ధ్యానంలో కూర్చుంటే జ్ఞానవంతులయిపోతారా? కొద్దిపాటి ధ్యానానికే వివేకానందలు అయిపోతారా? రమణ మహర్షులు అయిపోతారా? బుద్ధుళ్ళు అయిపోతారా?

వారంతా జీవితాన్ని ఎంత త్యాగం చేసారు? సాధన చెయ్యటానికి ఎంత కష్టపడ్డారు? కొన్ని సంవత్సరాలు బయటకు రాకుండా సాధనలోనే వుండిపోయారే? ఐహిక సుఖాల మీద అంటే ఆహారం మీద, సంసారం మీద, సంపదల మీద వ్యామోహం వదిలేసారే? ఒక రకంగా జ్ఞానం పొందడం కోసం, జీవితాన్ని పణంగా పెట్టారే. జ్ఞానం పొందటానికి ఎంత కష్టపడ్డారు? ఎన్ని కష్టాలుఎదుర్కొన్నారు? అలాంటిది రోజులో ఉదయం ఒక గంట రాత్రి ఒక గంట కళ్ళు మూసుకుంటే జ్ఞానవంతులయిపోతారా? ఆలోచించండి? వారిలా ఎంతకష్టపడాలి? ఎంత సాధన చెయ్యాలి?

జ్ఞానం పొందడం కష్టం కాబట్టే! రమణ మహర్షి తరువాత ఆయన భోధలకు ప్రభావితులైన ఎన్నో లక్షల మంది ఆయన మార్గంలో నడిచారు. కానీ ఎంత మంది రమణ మహర్షులు కాగలిగారు? అలాగే వివేకానంద తరువాత ఎన్నో కోట్ల మంది ఆయన్ను అధ్యయనం చేసారు, ఆయన్ను అనుసరించారు. కానీ ఎంత మంది వివేకానందలు కాగలిగారు?

అలాగే ఎన్నో కోట్ల మంది బుద్ధుని అనుసరించారు కానీ ఎంతమంది బుద్ధుళ్ళు కాగలిగారు? అందుకే శ్రీ కృష్ణభగవానుల వారు ఈ సందేశం ఇవ్వడం జరిగింది.

**శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే ।**
**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతౌ ॥ (భ.గీ.7-3)**

తా:- వేలాది మంది మనుష్యులలో ఒకానొకడు మోక్షసిద్ధికొరకు ప్రయత్నించును. అట్లు ప్రయత్నించు వేలమందిలో ఒకానొకడు మాత్రమే నన్ను యదార్థముగా తెలిసికొనుచున్నాడు.

దీనిని బట్టి చూస్తే జ్ఞానం పొందటం అంత తేలికైన విషయం కాదని అర్థమవుతుంది కదా? అందుచేత జ్ఞానం పొందాలనుకునే వారు అంత తేలికగా తీసుకోకండి.

పత్రీజీ చెప్పినట్టు ధ్యానం వల్లనే అంటే ధ్యానం చేస్తేనే జ్ఞానం వస్తుంది. అందులో సందేహం లేదు. ధ్యానం ద్వారా జ్ఞానం ఎలా పొందుతామో పైన తెలుసుకున్నాం. కానీ దానికి తగ్గ కృషి, పట్టుదల, దీక్ష వుండాలి. జ్ఞానం పొందాలనే తీవ్ర కాంక్ష వుండాలి. అప్పుడే ఎవరైనా సాధించగలరు. అంతేకానీ 'ఎంజాయ్' చెయ్యటానికే జీవితం అనుకునే వారికి జ్ఞానం ఎలా అబ్బుతుంది? జ్ఞానం సంపాదించడం కోసమే జీవితం అనుకున్న వారికి కొద్దిగా అయినా జ్ఞానం అబ్బుతుంది కానీ, లేని వారికి జ్ఞానం ఎలా అబ్బుతుంది?

ఆత్మజ్ఞాని కావడమంటే దైవంగా మారడం దైవస్థితి పొందడం, మరి మామూలు మనిషి దేవుడు అవ్వాలంటే అంత తేలికా? దైవానికి ఎన్ని అర్హతలు వుండాలి? ఆ అర్హతలన్నీ పూర్ణ జ్ఞానం పొందితేనే కదా లభించేది? అందుకే అటువంటి జ్ఞానం పొందాలనుకునే వారికి, ఆ ప్రయత్నం చేసే వారికి ఈ సృష్టిలో ప్రతి స్థాయిలో ఎన్నో పరీక్షలు పెట్టబడతాయి. ఆటంకాలు, అవరోధాలు కల్పించబడతాయి. అటువంటి వాటిని అధిగమించాలంటే చాలా కష్టపడాలి, కష్టాలు కూడా పడాలి. అవన్నీ అధిగమించినపుడే జ్ఞానం పొందే అర్హత లభిస్తుంది. అలా కష్టాలు పడి సాధించిన వారే. అందరూ దేవుళ్ళు అనుకునే వారంతా.

అసలు సృష్టిలో ఈ పరీక్షలు, ఆటంకాలు, అవరోధాలు లాంటివి లేకపోతే ప్రతి ఒక్కరూ కొద్ది రోజులు ధ్యానం చేసి జ్ఞానం సంపాదించుకుని దేవుళ్ళు అయిపోతారు కదా? మరి అయిపోతున్నారా? అంటే అవ్వట్లేదు కదా? కారణం దేవుళ్ళు కావాలంటే ఎన్నో అర్హతలు వుండాలి. ఆ అర్హతలు సంపాదించుకోవడం కోసమే సృష్టిలో ఈ ఏర్పాటు. అంటే పరీక్షలు, అవరోధాలు, కష్టాలు.

అందుచేత ఈ మార్గంలో ఎదిగిన వారు ఎక్కడో అక్కడ, ఏదో ఒక సందర్భంలో, ఏదో ఒక లోపం వల్ల మరల మొదటికి రావడం జరుగుతుంది. ఎక్కడికక్కడ జాగ్రత్త పడుతూ, కష్టపడి సాధన చేస్తూ, నియమాలు పాటిస్తేనే ఎదగగులుగుతారు. అంటే జ్ఞానం పెంచుకోగలుగుతారు. దైవత్వాన్ని సంపాదించుకోగలుగుతారు.

ఇక్కడ మనం గమనించవలసిందేమిటంటే! దేవుళ్ళంతా ఎంతో

శక్తివంతులు. శక్తి కలిగిన వారినే దేవుళ్ళు అంటాం. ఆ శక్తి వారు ధ్యానం ద్వారానే సంపాదించుకున్నారు. ఒక రకంగా శక్తి పెరిగితేనే గుణం మారుతుంది. అలాగే గుణం మారింది అంటే శక్తి పెరిగినట్టే. అందుచేత తమో గుణంలో వున్నవారి కంటే రజోగుణంలో వున్నవారికి ఎక్కువ శక్తి వున్నట్టు. అలాగే రజోగుణంలో వున్న వారి కంటే సాత్విక గుణంలో వున్న వారికి ఇంకా ఎక్కువ శక్తి వున్నట్టు, అలాగే సాత్వికగుణంలో వున్న వారి కంటే శుద్ధ సాత్వికంలో వున్న వారికి ఇంకా శక్తి వున్నట్టు శుద్ధ సాత్వికంలో వున్నవారి కంటే నిర్గుణంలో వున్న వారికి పూర్ణ శక్తి వున్నట్టు అందుచేత వారు పూర్ణజ్ఞానంతో బహుముఖ ప్రజ్ఞను ప్రదర్శించగలుగుతారు.

శక్తి తగ్గే కొద్దీ మరల గుణం మొదటికి వస్తుంది. మరల వారు ఆ గుణాన్ని బట్టి మామూలుగా ప్రవర్తిస్తారు. అందుచేత సృష్టిలో పెట్టబడే పరీక్షలు అధిగమించినపుడే వారు సంపాదించుకున్న శక్తి అలాగే వుండిపోతుంది. గుణం కూడా మారదు. అందుచేత గుణం తగ్గింది అంటే శక్తి తగ్గిందని గుణం పెరిగింది అంటే శక్తి పెరిగింది అని మనం అర్థం చేసుకోవచ్చు. సృష్టిలో వున్న పరీక్షలన్నీ శక్తిని హరింపచేసేవే.

అలాంటి పరీక్షల్లో ఆహారం ఒకటి. కొన్ని రకాల ఆహారాలు మానవుని గుణాన్ని తగ్గించి వేస్తాయి. అంటే శక్తిని తగ్గించినట్లే లెఖ్ఖ. అలా కొన్ని ఆహారాలు రజోగుణాన్ని కలిగించేవి వున్నాయి. కొన్ని ఆహారాలు తమో గుణాన్ని కలిగించేవి వున్నాయి. తమోగుణం అంటే అత్యంత తక్కువ శక్తి రజోగుణం తక్కువ శక్తే కానీ, తమోగుణం కంటే ఎక్కువ.

సాత్విక గుణంలో వున్న వారు కానీ, శుద్ధ సాత్వికంలో వున్న వారు కానీ రజోగుణ, తమోగుణ ఆహారాలు తీసుకుంటే వారి మనస్సు ఆ గుణంలోకి మారిపోతుంది. అంటే వారి శక్తి తగ్గిపోయినట్టే లెఖ్ఖ. ఎంతో కష్టపడి ... ఆరు మాసాలు కానీ, ఆరు సంవత్సరాలు ధ్యానం చేసి సంపాదించిన శక్తి అంతా అటువంటి ఆహారాలు తీసుకోవడం వల్ల కోల్పోవడం జరుగుతుంది. అంటే సంవత్సరాల తరబడి చేసిన సాధన అంతా వృధా చేసుకున్నట్టే. మరల మామూలు మనుషులులా ప్రవర్తిస్తారు. ఇది సృష్టిలో ఆహారం ద్వారా వీరికి పెట్టబడిన పరీక్ష అనుకోవాలి.

మానవుడికి జిహ్వా చాపల్యం ఎక్కువ అంటే రుచికి ప్రాముఖ్యం ఇస్తాడు. రుచికి బానిస అవుతాడు. ఆ బలహీనత వల్ల, ఆకలి తట్టుకోలేకపోవడం వల్ల ఆహారం తీసుకుంటాడు. అంతే కానీ తీసుకునే ఆహారం తనకు లాభిస్తుందా? నష్టం కలిగిస్తుందా? అని ఆలోచించడు. తన శక్తిని హరిస్తుందా? లేదా? అని ఆలోచించడు. జ్ఞానం పొందాలనుకునే వారికి అంటే ఆధ్యాత్మికంగా ఎదగాలనుకునే వారికి ఆహారం ద్వారా క్రిందకు లాగబడుతున్నాను అన్న సంగతి తెలియదు. కానీ సరియైన గురువులను ఆశ్రయించి ఆహార నియమాలు తెలుసుకుంటే ప్రకృతిలో వున్న ఈ పరీక్ష అధిగమించవచ్చు.

అలాగే జ్ఞానం పొందాలనుకునే వారికి అంటే జ్ఞానం కోసం ధ్యానం చేసే వారికి మరికొన్ని పరీక్షలు సృష్టిలో పెట్టబడతాయి. అవి (1) కామము, (2) క్రోధము, (3) లోభము.

ఈ కామము, క్రోధము, లోభము అన్న విషయాలలో పరీక్షలు పెట్టబడతాయి అనడానికి పురాణాలలో విశ్వామిత్రుని జీవితమే ఒక ఉదాహరణ.

విశ్వామిత్రుడు 1000 సంవత్సరాలు తపస్సు చేసి అంటే ధ్యానం చేసి అపారమైన శక్తి సంపాదించాడు. ఒక రకంగా సృష్టికి ప్రతి సృష్టి చేయగలిగినంత శక్తి సంపాదిం చాడు. అటువంటి విశ్వామిత్రుడు ఆ శక్తితో లోకానికి మేలు చేస్తాడా? కీడు చేస్తాడా? అని పరీక్షించదలచుకుని ఇంద్రుడు మేనకను పంపించి విశ్వామిత్రుని కామానికి (కోరికలకు) పరీక్ష పెట్టాడు.



మేనక సౌందర్యం చూసి విశ్వా మిత్రుడు మోహించాడు. మేనకను పెళ్ళి చేసుకోమన్నాడు. అపుడు మేనక చిన్న షరతు పెట్టింది. నా కోరిక కాదన్న క్షణం నిన్ను విడచి వెళ్ళిపోతాను అంది. దానికి విశ్వా మిత్రుడు అంగీకరించి వివాహం చేసుకున్నాడు. మేనక రోజూ చిత్ర విచిత్రమైన కోరికలు కోరేది. ఏవి దొరకవో అవి కావాలనేది. విశ్వామిత్రుడు కాదనలేక తన శక్తిని కొంత ఖర్చు పెట్టి ఆమె కోరిక తీర్చేవాడు. అలా ఆమె కోరికలు తీరుస్తూ

తన శక్తినంతా ఖర్చు పెట్టేసాడు.

ఒక రోజు ఆకాశ విహారం చేద్దామని మేనక అడిగితే విశ్వామిత్రుడు ప్రయత్నించాడు కానీ శక్తి అంతా ఖర్చు అయిపోవడం వల్ల అతనికి సాధ్యం కాలేదు. అపుడు అర్థమయ్యింది. కామం కోసం అంటే కోరికల కోసం తన శక్తినంతా ఖర్చు చేసుకున్నానే అని బాధపడ్డాడు. అపుడు అనుకున్నాడు కామానికి వశుడు కాకూడదని.

చేసేది ఏమీ లేక మరల 1000 సంవత్సరాల తపస్సు చేసి మరల శక్తి సంపాదించాడు. ఈసారి ఇంద్రుడు క్రోధానికి పరీక్ష పెట్టాలనుకున్నాడు. ఈసారి రంభను పంపాడు. రంభను చూడగానే విశ్వామిత్రునికి విపరీతమైన ఆగ్రహం వచ్చింది. నాకు ఇంద్రుడు పరీక్షలు పెడతాడా? అని ఆగ్రహంతో రంభను శిల అవవమని శపించాడు. శపించగానే తన శక్తి అంతా కర్చు అయిపోయింది. మామూలు మనిషి అయిపోయాడు. అప్పుడు క్రోధానికి కూడా లోను కాకూడదని అనుకున్నాడు

మరల 1000 సంవత్సరాల తపస్సు చేసి మరల అంతశక్తి సంపాదించాడు. ఈసారి ఇంద్రుడు లోభానికి పరీక్ష పెట్టాడు. విశ్వామిత్రుడు భోజనానికి కూర్చోగానే ఇంద్రుడు మారు వేషంలో భిక్షను అడిగాడు. అపుడు విశ్వామిత్రుడు ఆలోచించాడు. ఇది కూడా ఇంద్రుని పరీక్షే అనుకుంటూ తాను తినబోయే ఆహారాన్ని ఇంద్రునికి ఇచ్చాడు.

అపుడు ఇంద్రుడు అన్నాడు. ఇపుడు నువ్వు అన్నింటిని అధిగమించావు. నువ్వు బ్రహ్మజ్ఞాన పదవికి అర్హుడవు అని తన నిజరూపాన్ని చూపించాడు.

పై పురాణ కథని బట్టి జ్ఞానం సంపాదించుకోవడానికి ప్రయత్నించే వారికి తెలియకుండా ఇలాంటి పరీక్షలు సృష్టిలో పెట్టబడతాయి. అందులో విఫలమైన వారు తమ శక్తిని కోల్పోవడమే కాకుండా మామూలు స్థితికి చేరుకుంటారు. అంటే సాధనలో మొదటికి వస్తారు. మరల ప్రయత్నం ప్రారంభించవలసిందే. కష్టపడవలసిందే.

అలా జ్ఞానం పొందాలనుకునే వారు అన్ని రకాలుగా అర్హులా? కాదా? అని చూడటానికే ఈ పరీక్షలు సృష్టిలో పెట్టబడతాయి. అవి సాధకులకు తెలియవు. సృష్టిలో పరీక్షలు కూడా తెలిసేలా వుండవు. అవి పరీక్షలన్నట్టుగా వుండవు. అందుచేత నిగ్రహం లేకపోతే పతనం చెందుతారు.

అలా అన్ని రకాల పరీక్షలు అధిగమించి పట్టుదలతో తీవ్రంగా సాధన కొనసాగిస్తే వారు 3వ స్థితికి చేరుకుంటారు అంటే శుద్ధమయిన మనస్సు శూన్యం చేసుకుంటారు. ఈ స్థితిలో వారిలో జ్ఞానం ఉదయిస్తుంటుంది. అంతేకాదు ఈ స్థితిలో వారికి కొన్ని రకాల అతీంద్రియ శక్తులు, సిద్ధులు ప్రకృతిచే ఇవ్వబడతాయి. ఆ శక్తులు కూడా వారి జ్ఞానాన్ని పెంచుకోవడానికి, విస్తరించుకోవడానికి మాత్రమే ఇవ్వబడతాయి.

అటువంటి వారు ఆ శక్తులు సద్వినియోగం చేస్తారా? దుర్వినియోగం చేస్తారా? అని వారికి మరికొన్ని అంటే (1) కీర్తి, (2) కాంత, (3) కనకం అన్న విషయాలలో పరీక్షలు పెట్టబడతాయి. అవి సహజంగా పరీక్షలులాగ వుండవు. అలా వుంటే ఎవరైనా జాగ్రత్త పడతారు.

ఆ శక్తులు ప్రదర్శిస్తూ వుంటే సామాన్యులు ఆశ్చర్యపోతారు. ఆయన దైవాంశ సంభూతుడని కొనియాడడతారు, పాదాభివందనాలు చేస్తారు, సన్మానాలు చేస్తారు, వారి అడుగులకు మడుగులు ఒత్తుతారు, పొగుడుతారు, గొప్పగా కీర్తిస్తారు, హారతులిస్తారు. సహజంగా ఇలాంటి స్థితిలో ఎవరిలోనైనా అహంకారం పెరుగుతుంది. తానే గొప్పవాడినని పొంగిపోతారు. అందరికంటే నేనే గొప్పవాడినని భావిస్తారు. తాను ఏమి చెప్పినా అందరూ అంగీకరిస్తారు. ఏం చెయ్యమంటే అది చేస్తారు. అటువంటి పరిస్థితిలో అహంకారంతో చేయకూడని పనులు చేస్తారు. సృష్టి విరుద్ధమైన పనులు చేస్తారు, చేయిస్తారు. అలా ప్రవర్తించడం వల్ల తనకు ఇవ్వబడిన శక్తులన్నీ కోల్పోవలసి వస్తుంది. అంటే ఏ సృష్టి అయితే ఆ శక్తులను యిచ్చిందో ఆ సృష్టే వాటన్నింటిని ఉపసంహరించుకుంటుంది. అలా కీర్తి అనే పరీక్షలో తప్పడం వల్ల మామూలు మనిషైపోతాడు. ఒకవేళ ఆ పరీక్షను అధిగమించినపుడు వారికి కనకం అనే పరీక్ష పెట్టబడుతుంది.

అటువంటి వారు అడగకుండానే భక్తులు కానుకలు సమర్పిస్తూ వుంటారు. అడగకుండానే లక్షలు, కోట్లు ఆశ్రమానికి సమర్పిస్తూ వుంటారు. మొదట్లో వాటిని పెద్దగా పట్టించుకోరు కానీ ఆశ్రమాలను విస్తరించాలనే నెపంతో వాటిని తీసుకోవడమే కాదు భక్తుల నుంచి రకరకాల కారణాలతో ధనం, బంగారం, భూములు లాంటివి సేకరిస్తారు. అలా వారి ఆశకు అంతం వుండదు.

ఆ ధనం కోసం భక్తులకు రకరకాల ఆశలు కల్పిస్తారు. హామీలు ఇస్తుంటారు. ఏదేదో చేస్తానని మభ్యపెడుతూంటారు. కాదన్న వారిని రకరకాల భయాలకు గురి చేస్తుంటారు. చివరకు సృష్టి విరుద్ధమైన పనులు కూడా చేస్తారు.

సృష్టి నియమేమిటంటే పొందినవి పంచాలి కానీ, ఉంచుకుని పెంచుకో కూడదు. పంచడానికే ఇవ్వబడ్డాయి కానీ పెంచుకోవడానికి ఇవ్వబడలేదు.

అలా ఎప్పుడయితే సృష్టి విరుద్ధంగా ప్రవర్తిస్తారో కనకం మీద అంటే ధనం మీద కాంక్ష పెరుగుతుందో! చేయకూడని పనులు చేస్తారో! వారి శక్తులన్నీ కోల్పోవలసి వస్తుంది. అంటే కీర్తిని అధిగమించగలిగినా కనకం విషయంలో పెట్టబడిన పరీక్ష తప్పుతారు.

ఈ ధ్యాన మార్గంలోకి వచ్చిన వారు చాలా మంది ఈ విషయంలోనే విఫలం చెందుతున్నారు. ఎంత సాధన చేసినా మరల మొదటికే వస్తున్నారు. ఒకవేళ ఈ విషయంలో కూడా అధిగమించగలిగినా 'కాంత' అనే పరీక్ష వల్ల ఎటువంటి వారైనా పతనం చెందుతూ వుంటారు.

అటువంటి వారి మహత్యాలు, జ్ఞానం చూసి ప్రభావితులై పురుషులకు స్త్రీలు, స్త్రీలకు పురుషులు ఆకర్షితులవుతారు. వారికి అతి సన్నిహితంగా మెలుగుతారు. వారి వల్ల తమ సమస్యలు పరిష్కరించుకోవచ్చని, తమ బాధలు పోగొట్టుకోవచ్చని దగ్గరగా చేరతారు. అటువంటి సందర్భాలలో వీరు చేయకూడని పనులు చేసినా, సృష్టి విరుద్ధంగా ప్రవర్తించినా వారు తమ శక్తులు కోల్పోవలసి వస్తుంది. ఎన్ని పరీక్షలు అధిగమించినా 'కాంత' అనే పరీక్షలో ఎటువంటి వారైనా పతనం చెందుతున్నారు.

కానీ దీనిని కూడా అధిగమించగలిగితే వారికి ఇవ్వబడిన శక్తుల ద్వారా పూర్ణ జ్ఞానాన్ని సంపాదించుకోగలుగుతారు. దైవంగా మారతారు. సృష్టిలోనే గొప్పవారిగా కీర్తించబడతారు.

అందుచేత తెలుసుకోండి "ధ్యానం వల్లనే జ్ఞానం" అన్నదాంట్లో సందేహం లేదు. కానీ వూరికే కొద్దిపాటి ధ్యానం చేసినంత మాత్రాన 'జ్ఞానం' రాదని తెలుసుకోవాలి. ధ్యానానికి... జ్ఞానం పొందటానికి మధ్య ఎంతో తతంగం వుంది. అంటే ఎన్నో స్థితులు వున్నాయి,. పరీక్షలున్నాయి, ఆటంకాలు వున్నాయి. అందుచేత కష్టపడి ధ్యానం చెయ్యండి, నియమాలు పాటించండి, జ్ఞానులవ్వండి,

జీవితాన్ని ధన్యం చేసుకోండి, దైవత్వాన్ని పొందండి.

## మరొక్కసారి తెలుసుకోండి!

ఇక్కడ మనం తెలుసుకోవలసింది ఏమిటంటే 'శ్వాస మీద ధ్యాస' వుంచితే కానీ చెంచల మనస్సు నిశ్చలమవ్వదు. అంటే ఆలోచనలు లేని స్థితికి చేరుకోలేరు. మనస్సు నిశ్చలమవుతే కానీ ఆ తరువాత స్థితికి చేరుకోలేరు. అంటే మనస్సు నిర్మలమవ్వదు, అంటే శుద్ధి కాదు. మనస్సు శుద్ధి అవుతేనే బుద్ధి వికసిస్తుంది.

మనస్సు శుద్ది అవుతేనే దాని తరువాత స్థితి కలుగుతుంది అంటే శూన్యమవుతుంది. మనస్సు శూన్యమవుతేనే 'జ్ఞానం' ఉదయిస్తుంది. అలా మనస్సు ఎంత శూన్యమయితే అంత 'జ్ఞానం' పెరుగుతుంది.

దీనిని బట్టి ఏ మానవుడైనా జ్ఞానం పొందాలంటే అంతర్గతంగా మనస్సులో ఎన్ని మార్పులు జరగాలో తెలుసుకోవచ్చు. ఈ మార్పులన్నీ ధ్యానం యొక్క తీవ్రత పెరుగుతూంటేనే సాధ్యమవుతుంది.

ఒక రకంగా మనస్సు నిర్మలం చేసుకోవడమంటే తమోగుణాన్ని, రజోగుణాన్ని తొలగించుకుని సత్వగుణం సంపాదించుకోవడం. అలాగే మనస్సును శూన్యం చేసుకోవడమంటే సత్వగుణాన్ని తొలగించుకుని నిర్గుణం సంపాదించుకోవడం.

ఇక్కడ గమనిస్తే సత్వగుణంలో 'బుద్ధి' వికసిస్తుంది. నిర్గుణంలో 'జ్ఞానం' ఉదయిస్తుంది. అంటే బుద్ధి ద్వారానే జ్ఞానం సంపాదించుకోగలుగుతాం. జ్ఞానం కలిగిన తరువాత ఆ బుద్ధి మరింత గొప్పగా తయారవుతుంది.

అందుచేత ధ్యానం చేసేవారు ఈ మార్పులన్నీ గమనిస్తూ వుండాలి. అటువంటి మార్పులు రాకపోతే సాధనలో కానీ, ఆహార నియమాలలో కానీ, మరెక్కడో కానీ లోపం వుందని తెలుసుకోవాలి. వీటిని సరి చేసుకోవాలి.

అలా జాగ్రత్త పడుతూ సాధన చేస్తే 'జ్ఞానం' ఎవరైనా సంపాదించుకోవచ్చు. జ్ఞానం పొందాలనుకునే సాధకులు ధ్యాన సాధనతో పాటు జ్ఞానవంతమైన పుస్తకాలు చదవడం, జ్ఞానులతో సాంగత్యం చేయడం కూడా చేస్తే ఇంకా తొందరగా జ్ఞానం పొందే అవకాశం వుంది.

దానితో పాటు పొందిన జ్ఞానం అందరికీ పంచుతూ వుంటే అంటే ఈ

జ్ఞాన మార్గంలో 'సేవ' చేస్తూంటే ఇంకా తొందరగా జ్ఞానులయ్యే అవకాశం వుంది.

ఏది ఏమైనా మనస్సు శూన్యమైన నిర్గుణ స్థితిలోనే అనుభవ జ్ఞానం కలుగుతుందని తెలుసుకోండి. అనుభవ జ్ఞానమే అసలైన 'జ్ఞానం'. ఆ జ్ఞానమే కర్మలను దగ్ధం చేస్తుంది. మోక్షాన్ని కలిగిస్తుంది. జన్మలు లేకుండా చేస్తుంది.

ఏది ఏమైనా మానవుడు కష్టపడితే సాధించలేనిదంటూ ఏదీ వుండదు.

## ఖాళీ మనస్సు - శూన్య మనస్సు

ఇక్కడ ఇంకా తెలుసుకోవలసింది ఏమిటంటే ఖాళీ మనస్సుకు, శూన్య మనస్సుకు తేడా తెలుసుకోవాలి. కారణం చాలా మంది ఖాళీ మనస్సునే శూన్య మనస్సు అనుకుంటున్నారు.

ఖాళీ మనస్సు అంటే ఆలోచనలు లేని మనస్సు అంటే నిశ్చలమైన మనస్సు అంటే ప్రారంభ స్థితి. కానీ శూన్య మనస్సు అంటే మనస్సు శూన్యమైన స్థితి. ఇక అక్కడ మనస్సు యొక్క ప్రాముఖ్యం లేదని అర్థం. దీనినే రమణ మహర్షి కాలిపోయిన తాడుతో పోల్చారు. ఇది చివరి స్థితి.

మొదటి స్థితిలో మనసు ఖాళీ అవుతుంది కానీ మనస్సు వుంటుంది. పైగా మలినంగా వుంటుంది. అంటే ఇంకా శుద్ధి కాలేదు. తరువాత స్థితిలోనే శుద్ధి అవుతుంది. ఉదాహరణకు ఖాళీకుండ అంటాం, అంటే కుండ వుంది కానీ ఖాళీగా వుంది. కుండలో కూర వండారు. తినేసారు అంటే ఖాళీ చేసారు. అందుచేత ఖాళీ కుండ అంటాం. కానీ ఈ కుండను ఇంకా కడగలేదు అంటే శుద్ధి చేయలేదు. అంటే మలినమైన ఖాళీ కుండ అని అర్థం.

అలాగే మనసు ఆలోచనలు లేకుండా ఖాళీ అయింది కానీ అది ఇంకా శుద్ధి కాలేదు. అంటే మలినమైన ఖాళీ మనస్సు అని అర్థం. ఇది ప్రారంభ స్థితి. తరువాత శుద్ధమైన మనస్సు. ఇది రెండవ స్థితి. తరువాత శూన్యమైన మనస్సు, ఇది చివరి స్థితి. అందుచేతే ఆలోచనలు లేని మొదటి స్థితిలో వున్న వారు మనస్సు శుద్ధి కాకపోవడం వల్ల వారి ప్రవర్తనలో పెద్దగా మార్పు కనిపించదు.

అంతకు ముందు తప్పులు, పాపాలు చేస్తుంటే కనుక ఈ స్థితిలో వున్నవారు అలాంటి తప్పులే చేస్తుంటారు. వారికి ధ్యానం వల్ల కొన్ని లాభాలు

రావచ్చునేమో కానీ ప్రవర్తనలో మార్పు కనిపించదు.

ప్రవర్తనలో మార్పు రావాలంటే మనస్సు శుద్ధి కావాలి. ప్రవర్తన దైవంలా వుండాలంటే మనస్సు శూన్యమవ్వాలి.

## మనో శూన్యమే 'జ్ఞానం'

అందుచేత మనస్సు శూన్యం చేసుకోవటానికి ప్రయత్నించండి. జ్ఞానవంతులు కండి. అందరికీ ఆదర్శ ప్రాయులవ్వండి. శ్రీ కృష్ణుడు, బుద్ధుడు, జీసస్, మహ్మద్, నానక్, పత్రీజీలులా లోకానికి సేవ చెయ్యండి. అందరిని జ్ఞానవంతులను చెయ్యటానికి కృషి చెయ్యండి.

ఏది ఏమైనా ఈ మార్పులన్నీ ధ్యానం వల్లనే సాధ్యమని తెలుసుకోండి. ధ్యానం చెయ్యండి. పత్రీజీ మార్గంలో పయనించండి.

# "అనునిత్య సాధన"



**"సాధన" అన్నదే ... సర్వస్వం**

**సర్వస్వాన్నీ ఇచ్చేదే ... "సాధన"**

ఆత్మజ్ఞాన ముముక్షువులకు సంబంధించినంత వరకు

"సాధన" అంటే "ధ్యానసాధన"

**యోగి అవ్వాలంటే .. ధ్యాన సాధన**

**ఋషి అవ్వాలంటే .. మహాధ్యానసాధన**

**"మహర్షి"** అవ్వాలంటే .. మహా మహా ధ్యాన సాధన

**"బ్రహ్మర్షి"** కావాలంటే .. మహా మహా ధ్యానసాధన ..

మరి ఇంకా ఎంతో ధ్యాన సాధన

**సాధన కు పూర్వం "లఘువు" .. సాధన తర్వాత "గురువు"**

సాధనను అందరికీ సదా, అందిస్తూ ఉంటే .. **పరమగురువు**

సాధనను అందరికీ అందిస్తూన్నవాడు మహాపురుషుడు, **బుద్ధపురుషుడు**

**ధ్యానసాధనకు పూర్వం .. పామరుడు**

**ధ్యానసాధన తరువాత .. పండితుడు, సిద్ధపురుషుడు**

**"సాధన"** అంటే "అనునిత్య సాధన" ..

**"సాధన"** అన్నది రోజువారీ తప్పనిసరి కార్యక్రమం

**"సాధన"** అంటే ... సర్వదేశ కాలమాన పరిస్థితుల్లోనూ .. సాధన

**"సాధన"** అంటే ... తీవ్ర పురుష యత్నం .. దీక్షాయుత పురుష ప్రయత్నం

**సాధన అంటే .. అకుంఠిత దీక్ష**

ఎవరి సాధన వారిదే .. ఎవరి సిద్ధత్వం వారిదే

లఘువులందరినీ సాధనకు సదా ప్రోత్సహించడమే గురువులందరి యొక్క ధ్యేయం, అస్తిత్వం గురువులందరి దగ్గర నుంచి సాధనకు కావలసిన ప్రోత్సాహాన్ని, స్ఫూర్తినీ పొందడమే లఘువులందరి మహాభాగ్యం

**సాధనతో సమకూరు సకల పనులు .. ధరణిలోన, విశ్వములోన**

**అనునిత్య సాధన జయహో..నిరంతర సాధన జయ జయహో**

# అనుబంధం



## "పారిజాత పుష్పాలు"

**"ఎన్‌లైటెన్‌మెంట్"** అన్న ఆంగ్ల పదానికి
తెలుగులో **"యథార్థజ్ఞానప్రకాశం"** అని ఒక అర్థం
ఇంకో విధంగా చెప్పుకోవాలంటే...
**"ఎన్‌లైటెన్‌మెంట్"** అంటే
**"బుద్ధి యొక్క సంపూర్ణ పరిపక్వ స్థితి"**
మరి **"మానవజాతి వికాసంలోని అత్యున్నతమైన పరాకాష్ఠ స్థితి"**
మానవ జీవితాన్ని మౌలిక యదార్థ స్వరూపంగా తెలుసుకున్నవాడే
**"ఎన్‌లైటెన్డ్ మాస్టర్"** **మదర్‌థెరిస్సా, మహాత్మాగాంధీ** లాంటివాళ్ళు
**ప్రాపంచికపరంగా ఎన్‌లైటెన్డ్ మాస్టర్స్ గౌతమబుద్ధుడు, మహావీరుడు,**
**ఏసుప్రభువు** లాంటి వాళ్ళు **ఆధ్యాత్మికపరంగా ఎన్‌లైటెన్డ్ మాస్టర్స్**
సకల ప్రాణికోటి యొక్క ఉన్నతికీ, ప్రగతికీ చేత అయినంత
సహాయ సహకారాలను సదా అందిస్తూ వుండేవాళ్ళే **"ఎన్‌లైటెన్డ్ మాస్టర్స్"**

**ప్రాపంచిక ఎన్‌లైటెన్‌మెంట్ – యథార్థజ్ఞానప్రకాశం..** అన్నది **తొలిమెట్టు**
**ఆధ్యాత్మిక ఎన్‌లైటెన్‌మెంట్ – దివ్యజ్ఞానప్రకాశం ..** అన్నది **మలిమెట్టు**
**"నిరంతర పరోపకారం"** అన్నది ప్రాపంచిక **ఎన్‌లైటెన్‌మెంట్**
అయితే దానితోపాటుగా **"పరలోక జ్ఞానాన్ని"** పొందుతూ వుండడమే
**"స్పిరిచ్యువల్ ఎన్‌లైటెన్‌మెంట్"**
**భువికి** సంబంధించినది **"యథార్థజ్ఞానప్రకాశం"** అయితే
**"స్పిరిచ్యువల్ ఎన్‌లైటెన్‌మెంట్"** అన్నది **"దివి"**కి సంబంధించిన
**"దివ్యజ్ఞానప్రకాశం" "స్పిరిచ్యువల్ ఎన్‌లైటెన్‌మెంట్"** అంటే
"**పరలోకజ్ఞానంతో కూడిన ఆత్మయొక్క పూర్ణ వికసితస్థితి"**
పరలోక జ్ఞానంతో పరిపుష్ఠం అయివున్నవాళ్ళే
**దివ్యజ్ఞానప్రకాశంతో నిండిన** మాస్టర్స్
**"ఎన్‌లైటెన్‌మెంట్"**కు **"స్పిరిచ్యువాలిటీ"** అన్నది
తోడైతేనే పుష్పానికి **తావి** అబ్బినట్లు **తావి లేని పుష్పం**
సంపూర్ణమైన పుష్పం కాగలదు!
ప్రతి మానవుడి యొక్క ధ్యేయం .. **దివ్యజ్ఞానప్రకాశంతో** కూడిన
సుగంధపరిమళభూయిష్టమైన **"పారిజాత పుష్పం"**లా విలసిల్లడమే
**"పారిజాత పుష్పం"** అన్నది **భువికి** సంబంధించిన **మామూలు పుష్పం** కాదు..
అది **"దివి"**కి సంబంధించిన **"దేవలోకపు కుసుమం"**
**స్పిరిచ్యువల్ ఎన్‌లైటెన్‌మెంట్ = "పారిజాత పుష్పం"**
**స్పిరిచ్యువల్ ఎన్‌లైటెన్‌మెంట్ =**
**ధ్యానాభ్యాసం + సజ్జనసాంగత్య అభ్యాసం + స్వాధ్యాయ అభ్యాసం**
ఎంత ఎక్కువగా ధ్యాన అభ్యాసం చేస్తే ..
ఎంత ఎక్కువగా స్వాధ్యాయ అభ్యాసం చేస్తే ..
ఎంత ఎక్కువగా సజ్జన సాంగత్యం అభ్యాసం చేస్తే...
అంత ఎక్కువగా మనం సుగంధ పరిమళభరిత
దివ్యపారిజాత పుష్పాల్లా వికసిస్తాం
**పిరమిడ్ మాస్టర్లందరూ దివ్యజ్ఞానప్రకాశంతో వికసించిన పారిజాత కుసుమాలు!**
**భూలోకంలో ఇక అందరూ పారిజాత పుష్పాలుగా వికసించెదరు గాక!**

# "బుద్ధి + జ్ఞానం = బుద్ధత్వం"

"ఏమిట్రా వెధవా?! బుద్ధి, జ్ఞానం లేవూ?!"
ఈ విధంగా చిన్నప్పుడు ఎన్నోసార్లు విన్నాం .. కానీ అప్పుడు అర్థం కాలేదు
"ఏదో తప్పు చేసాం... అందుకే 'పెద్దవాళ్ళు' తిట్టారు" అనుకున్నాం
ఇంతకూ .. **"బుద్ధి"** అంటే ఏమిటి? **"జ్ఞానం"** అంటే ఏమిటి?
**"బుద్ధి"** అంటే ... **"మౌలికమైన ఇంగిత జ్ఞానం"**
**"బుద్ధి"** అంటే ... "వర్తమాన పరిస్థితుల పట్ల సరియైన అవగాహన"
**"బుద్ధి కలిగి వుండడం"** అంటే .. "సదా సందర్భోచితంగా
వ్యవహరించగలగడం", "సదా ఎరుకతో ప్రతిస్పందించగలగడం",
"సదా ఎరుకతో పనులు చేయగలగడం"
**"బుద్ధి కలిగి వుండటం"** అంటే .. "శాస్త్రీయమైన ప్రాపంచిక యోచనలు,
ప్రాపంచిక వాక్కులు కలిగి వుండటం" మొత్తం వెరసి "బుద్ధి" అంటే ..
**"బేసిక్ కామన్ సెన్స్"** .. **"మౌలికమైన ఇంగిత జ్ఞానం"**
**"జ్ఞానం"** అంటే **"స్వీయ ఆత్మ గురించి స్వీయ అనుభవ జ్ఞానం"**
**"జ్ఞానం"** అంటే .. పునర్జన్మ సిద్ధాంత సత్యం గురించి
కర్మ సిద్ధాంత సత్యం గురించి "అనుభవ జ్ఞానం"
**"జ్ఞానం"** అంటే .. "పరలోకాలను గురించిన శాస్త్రీయమైన సమాచారం"
**"జ్ఞానం కలిగి వుండటం"** అంటే "శాస్త్రీయమైన పారలౌకిక ఆత్మ
అనుభవాలు కలిగి వుండటం" వెనక్కి తిరిగి చూసుకుంటే...
ఈ **"జ్ఞానం"** గురించి ఆ పెద్ద వాళ్ళకు "ఏమీ తెలియదు" అనే చెప్పాలి
ఆ పెద్దలకు వాస్తవాలు ఉన్నవి వున్నట్లుగా ఏమీ తెలియక పోయినా...
ఏదో ఊతపదంగా **"బుద్ధి", "జ్ఞానం"** అంటూ ఊరికే పదాలను అలా
వాడేస్తూ ఉంటారు. **బుద్ధి + జ్ఞానం = బుద్ధత్వం**
పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ మూవ్‌మెంట్‌లో ... **బుద్ధి** విభాగానికీ, మరి
**జ్ఞానం** విభాగానికీ సరిసమాన ప్రాముఖ్యత ఉంది పిరమిడ్ స్పిరిచ్యువల్
సొసైటీస్ మూవ్‌మెంట్ లో... బుద్ధి వికాసానికీ, జ్ఞాన సముపార్జనకూ
విశేషంగా ప్రశిక్షణ ఇవ్వబడుతూ వుంటుంది

... అందరూ బుద్ధి, జ్ఞానం కలిగి ఉందురు గాక !

**"బుద్ధి", "జ్ఞానం"..** ఈ రెండూ సమపాళ్ళలో కలిగి వున్న వాళ్ళే..**"బుద్ధుళ్ళు"**

అనేక మందికి బుద్ధి ఉండవచ్చు కానీ .. 'జ్ఞానం' ఉండకపోవచ్చు ..

కొద్ది మందికి జ్ఞానం ఉండవచ్చు కానీ .. మరి 'బుద్ధి' ఉండకపోవచ్చు

.. జనులు అందరూ బుద్ధి, జ్ఞానం కలిగి ఉందురు గాక !

అందరూ బుద్ధుళ్ళు అవుదురు గాక ! **ధ్యానం → బుద్ధి + జ్ఞానం**

ప్రప్రథమంగా **"ధ్యానం", "ధ్యాన సాధన"** అన్నవి మానవులకు **"బుద్ధి"**ని

కలుగచేస్తాయి "బుద్ధి లేనివాళ్ళు" .. "బుద్ధి ఉన్నవాళ్ళు"గా తయారు

అవుతారు పరంపరగా "ధ్యానం", "ధ్యాన సాధన" అన్నవి జ్ఞానాన్ని

కలుగజేస్తాయి **"ధ్యానులు"..** అచిరకాలంలో **"జ్ఞానులు"**గా మారుతారు

పిరమిడ్ స్పిరిచ్యువల్ సొసైటీస్ మూవ్‌మెంట్ ..

బుద్ధుళ్ళు కాదలచుకునే వారందరికీ .. ఆహ్వానం పలుకుతోంది

భూలోకంలో అందరూ విశేషమైన బుద్ధి, మరి అపారమైన జ్ఞానం కలిగి

ఉందురు గాక! **బుద్ధి + జ్ఞానం → సుఖం**

**"బుద్ధి", "జ్ఞానం"** అన్నవి కలిగి వుంటేనే **"జీవితం సుఖవంతం"**

"లోకాః సమస్తా సుఖినో భవంతు" సమస్త లోకాలన్నీ సుఖంగా జీవించుగాక!

**ధ్యానం → బుద్ధి + జ్ఞానం = బుద్ధత్వం → సుఖమయ జీవితం**

# "బుద్ధి + జ్ఞానం = పుష్పం+ పరిమళం"

ధనం ఉంటే .. "ధనవంతురాలు / ధనవంతుడు" అంటారు

బలం ఉంటే .. "బలవంతురాలు/బలవంతుడు" అంటారు

అందం ఉంటే .. "అందగత్తె/అందగాడు" అంటారు

**"బుద్ధి"** ఉంటే .. **"బుద్ధిమంతురాలు/బుద్ధిమంతుడు"** అంటారు.

ధనం కన్నా .. బలం కన్నా .. అందం కన్నా మహత్తరమైనది **"బుద్ధి"**

గొప్ప వారినీ, మరి సామాన్యులనూ, సమంగా చూడగలగడమే **బుద్ధి** యొక్క నైజం

**బుద్ధికి** మరో పేరు .. **"వివేకం"**

**వివేకానికి** మరో అర్థం .. **"సమయస్ఫూర్తి"**

**వివేకానికి** మరో అర్థం .. **"సందర్భస్ఫూర్తి"**

**వివేకానికి** మరో అర్థం .. **"ఇంగిత జ్ఞానం"**

సమయ సందర్భానుసారంగా, సౌమ్యంగా, ఉభయకుశలోపరిగా

వ్యవహరించగలగడమే ... **"ఇంగితజ్ఞానం-కలిగివుండటం"** అంటే

**బుద్ధికి** మరో పేరు **"సమత్వం"**

కలిగి ఉన్నవారినీ, మరి కలిగి లేని వారినీ

సర్వత్రా, సమంగా చూడగలగడమే **"సమత్వం కలిగి వుండడం"** అంటే

**బుద్ధి**కి మరో పేరు .. **"మృదుమధుర హాస్యం"**

అహంకరించడం, పరిహసించడం అన్నవి బుద్ధి లేకపోవడానికి సూచికలు

వ్యంగ్య భాషణం .. వ్యంగ్య వ్యవహారం .. అన్నవి బుద్ధిలేమికి నిదర్శనాలు

ఒక వృక్షాన్ని చూసినప్పుడు మన దృష్టి **పుష్పాల** వైపే వెళుతుంది ..

ఒకానొక వృక్షానికి శోభను ఇచ్చేది **పుష్పసంపదే**

**ఒకానొక మనిషికి శోభను ఇచ్చేది బుద్ధి సంపదే**

**"బుద్ధి"** అన్నది ఒకానొక .. **"పుష్పం"**

అయితే, ఒకానొక **పుష్పానికి** 'తావి' లేకపోతే అది **'పుష్పమే'** కాదు

అదేవిధంగా, **బుద్ధికి "జ్ఞానం"** అన్నది అంటకపోతే అది **'బుద్ధే'** కాదు

**"ఏమిత్రా! నీకు బుద్ధీ - జ్ఞానం లేవా?"** అని అంటారు కదా ..

**"జ్ఞానం"** అన్నది శాశ్వత ఆత్మకు సంబంధించింది

**“జ్ఞానం”** అన్నది పరలోక చింతన చేసేది
**“జ్ఞానం”** అంటే అది **“మరణం తరువాత ఏమిటి?”** అన్నది కనుక్కునేది
**“జ్ఞానం”** అంతే **“పుట్టుకకు పూర్వం ఏమిటి?”** అని తెలుసుకునేది
**“బుద్ధి”** అన్నది ఇహలోకపు నడవడికకు సంబంధించినది
**పువ్వు పుట్టగానే పరిమళించకపోవచ్చు .. కానీ పరిమళించి తీరాలి**
**“బహూనాం జన్మనామంతే .. జ్ఞానవాన్ ‘మాం’ ప్రపద్యతే**
**వాసుదేవ సర్వమితి స మహాత్మా సుదుర్లభః”**
ఎన్నో **“బుద్ధియుత జన్మల”** తరువాతే, పరంపరగా, మనలో **“జ్ఞానం”**
అన్నది అంకురిస్తుంది.
**“పువ్వు”గా** తయారైన తరువాత కూడా **మానవజన్మ** మరి పరిమళించాలంటే
ప్రాపంచిక **“బుద్ధియుత జీవితం”**తో పాటు
**“ఆత్మజ్ఞానం+అహింసాయుత జీవన విధానం”** అన్నవి విధిగా కలిగి వుండాలి
**“అహింసాయుత జీవన విధానం”**అంటే .. **“శాకాహారులుగా వుండడమే”**కదా!
తోటి జంతు, పక్షి, మత్స్య ప్రాణికోటి పట్ల **కరుణ, దయ** అన్నవి విధిగా
కలిగి ఉండాలి ప్రాపంచికంగా ఎంతటి గొప్ప మేధావులయినా, ఎంతటి
గొప్ప శాస్త్రజ్ఞులు అయినా ఎంతటి గొప్ప ప్రజానాయకులు అయినా
**“ఆత్మజ్ఞానం”** మరి **“అహింసాయుత జీవన విధానం”** అన్నవి మౌలికంగా
లేకపోతే వారి జీవితాలు ... **“వాసన లేని పువ్వులు”**గానే మిగిలిపోతాయి
ఇకనుంచీ ప్రాపంచికతతో నిండిన తావిలేని పుష్పాలన్నీ
**ఆత్మజ్ఞానం**తో కూడి .. అహింసా జీవిత విధానంతో కూడి ..
**‘తావి’** ఉన్న పుష్పాలుగా అవుగాక!
**బుద్ధి+జ్ఞానం = పుష్పం + పరిమళం**

# "శివుడు - త్రినేత్రుడు"



**"దివ్యచక్షువుకు పూర్వం 'జీవుడు' .. దివ్యచక్షుఉత్తేజితం తర్వాత 'శివుడు' "**

**"శివ"** అనే పదానికి **"ఆనందం"** అని అర్థం
**"మంగళకరం"** అనే మరో అర్థం కూడా ఉంది
కనుక **"శివుడు"** అంటే **"ఆనందమయుడు"** అని అర్థం
**"శివుడు"** అంటే **"మంగళకర జీవితం జీవిస్తున్నవాడు"** అని అర్థం
అయితే, ఈ **"శివ పదవి"** ఎలా సాధ్యం?
శివుడికి **"మూడవ కన్ను"** ను
అంటే , **"ఆత్మచక్షువు"** ను అంటే , **"అతీంద్రియ శక్తులను"**
ఉత్తేజపరచుకుంటారో వారందరూ **"శివుళ్ళే"** అవుతారు
దివ్యచక్షువుకు పూర్వం **"జీవుడు"** .. దివ్యచక్షుఉత్తేజితం తర్వాత **"శివుడు"**
**"మూడవ కన్ను"** తెరిస్తే మరి అంతా భస్మమవుతుందంట .. నిజమే!
ఎప్పుడైతే మన **"దివ్యచక్షువు"** సంపూర్ణంగా విచ్చుకుంటుందో
అప్పుడే మన ప్రాపంచికపరమైన **అజ్ఞానం భస్మమవుతుంది**
అప్పుడే, మన వికృతీ వికారాలు అన్నీ శాశ్వతంగా అంతమవుతాయి

**ధ్యానసాధన ద్వారానే "మూడవ కన్ను" ఉత్తేజితమవుతుంది**
**ధ్యానసాధన ద్వారానే "శివ పదవి" లభ్యమవుతుంది**

**"మూడవకన్ను" ఉత్తేజితమయితే "మాయ" అన్నది భస్మమవుతుంది**
**"మాయ" అన్నది శాశ్వతంగా "మాయం" అవుతుంది**

# “గురుదేవుళ్ళందరికీ ప్రణామాలు”



**“గురు పౌర్ణమి”**

**“వ్యాస పౌర్ణమి”** అని కూడా అంటారు.
**శ్రీ వేదవ్యాసులు ..** వారు ఆది గురువులలో
అత్యంత విశిష్ఠ స్థానాన్ని అధిరోహించిన వారు.
కనుకనే గురుపౌర్ణిమ **“వ్యాసపూర్ణిమ”**గా
అభివర్ణించబడింది. **“వ్యాసం”** అంటే **“వ్యాప్తం
కావడం”** ఏది వ్యాప్తం కావాలి?
మనం **వివేకం** అన్నది వ్యాప్తి కావాలి ...
మన **కరుణా హృదయం** అన్నది వ్యాప్తి చెందాలి..
మన **ఆత్మవిజ్ఞానం** అన్నది వ్యాప్తి చెందాలి ..
**“వివేకం”** అంటే  ఏది మంచిది, ఏది చెడు శాస్త్రీయంగా చెప్పేది
**“వివేకం”** అంటే  ఏది యుక్తం, ఏది అయుక్తం అన్న వాటిని స్పష్టపరచేది
**“వివేకం”**  అంటే ఏది శాశ్వతం, ఏది అశాశ్వతం అన్నది తెలియ జేసేది
**“వివేకం”** అంటే ఏది ప్రస్తుతం, ఏది అప్రస్తుతం వివరించి చెప్పేది
**“వివేకం”** అంటే ఏది సమంజసం, ఏది అసంమజసం ..
ఏది సందర్భం, ఏది అసందర్భం అన్న అవగాహనకు తెచ్చేది.
వివేకానికి మరో పేరు **“జ్ఞానం”** వివేకోదయమే **“జ్ఞానోదయం”**
**“గురుపౌర్ణిమ”** అన్నది సకల గురువులకూ అంకితమైనది
కష్టపడి మనకు ఎన్నెన్నో నేర్పించిన ప్రత్యక్ష గురువులనూ...
మరి సకల పరోక్ష గురువులనూ.. అందరినీ... ఆత్మీయ స్మరణకు తెచ్చుకునే
సమయం  **“యః యాచినోతి, ఆచరతి, ఆచారయతి చ సః ఆచార్యః”**
“ఎవరైతే వివేకాన్నీ, జ్ఞానాన్నీ యాచిస్తారో.. మరి స్వయంగా ఆచరణలో
పెడ్తారో... అంతేకాక, **ఇతరులతో కూడా ఆచరింపచేస్తారో
వారిని ‘ఆచార్యులు’** అంటారు” **ఆచార్యులు** అందరూ కూడా నిరంతరం
తమ తమ స్థాయిలలో వివేకాన్నీ, జ్ఞానాన్నీ...

ఎప్పటికప్పుడు మరింతగా ఆశిస్తూ, ఆర్జిస్తూ వుంటారు.
తమ తమ స్థాయిలలో ఆచరణలో పెట్టేందుకు
మరింతగా అభ్యాసం చేస్తూనే వుంటారు.
తమ తమ స్థాయిలలో ఇతరుల చేత
ఆచరింప చేయడానికి సదా కృషి చేస్తూనే వుంటారు.

**"మాతృదేవోభవ" ... "పితృదేవభవ"..**
**"ఆచార్యదేవోభవ"**

తల్లి ప్రప్రధమ గురువు, తండ్రి ద్వితీయ గురువు
**ఆచార్యులు తృతీయ గురువులు**

పుట్టించిన వాళ్ళు, పెంచిన వాళ్ళు అందరూ తల్లులే ... మరి తండ్రులే ...
విద్యాబుద్ధులు నేర్పించే వారందరూ ఆత్మబోధ చేసేవాళ్ళందరూ ..
మరి ఆచార్యులే.



## ధ్యానం చేసే పద్ధతి
## శ్వాస మీద ధ్యాస



ఎవరికి తగిన సుఖాసనంలో వారు హాయిగా కూర్చుని... చేతులు రెండూ కలిపి... కళ్ళు రెండూ మూసుకుని... ప్రకృతి సహజంగా జరుగుతున్న ఉచ్ఛ్వాస, నిశ్వాసలను గమనిస్తూ వుండాలి!

మధ్యమధ్యలో అనేకానేక ఆలోచనలు వస్తున్నా వాటిని ఎప్పటికప్పుడు 'కట్' చేస్తూ... మళ్ళీ, మళ్ళీ శ్వాస మీదకే... ధ్యాస మరల్చుతూ వుంటే.. క్రమ క్రమంగా... ఆలోచనా రహిత స్థితి కలుగుతుంది.... చిత్తవృత్తులు నిరోధించబడతాయి... మనస్సు నిర్విషయం, శూన్యం అయిపోతుంది. మనస్సు శాంతిస్తుంది. ఇదే ధ్యాన స్థితి.

ఈ ఆలోచనా రహిత స్థితిలో కలిగే అనేకానేక శారీరక, నాడీ మండల, ఆత్మానుభవాలను గమనిస్తూ వుండాలి. ఆ స్థితిలో విశ్వమయ ప్రాణశక్తి. అపారంగా శరీరంలోకి ప్రవేశించి నాడీ మండలాన్ని శుద్ధి చేస్తుంది. ఆ శక్తి వల్ల రోగాలన్నీ తగ్గుతాయి. నాడీమండల శుద్ధి వల్ల కర్మలు పోతాయి.

ప్రతిరోజూ ఎవరి వయస్సు ఎంతుంటుందో... కనీసం అన్ని నిమిషాలు... తప్పనిసరిగా... రోజుకి రెండు సార్లుగా... ధ్యానం చెయ్యాలి.

# "ఆత్మయొక్క అసలు కథ"

**ఆత్మ** అన్నది ... ఆద్యంత్యములు లేనిది
**ఆత్మ** అన్నది ... భౌతికం కాదు
**ఆత్మ** అన్నది ... మూలచైతన్యపు **"శకలం కాని శకలం"**
**ఆత్మ** అన్నది ... భౌతిక రూపురేఖలు లేనిది
**ఆత్మ** అన్నది ... కేవలం **"అనుభవాల రూపురేఖలు"** కలది
**ఆత్మ** అన్నది ... భౌతిక బరువులు లేనిది
**ఆత్మ** అన్నది ... కేవలం **"అనుభవాల బరువు"**ను కలిగివున్నది
**ఆత్మ** అన్నది ... ఒకానొక **"కోరికల పుట్ట"**
**ఆత్మ** యొక్క తపన ఎప్పుడూ నూతన అనుభవాల కోసమే
**ఆత్మ** యొక్క తపన ఎప్పుడూ భిన్న విభిన్న అనుభవాల కోసమే
**ఆత్మ**కు అన్ని పరిస్థితులూ ఆశ పుట్టించేవే
**ఆత్మ** అన్నది "అన్ని పరిస్థితులనూ అవగాహన చేసుకోవాలి" అని సదా ఆతృతపడేదే
**ఆత్మ**కు ఓటమి అన్నదే లేదు ...
ఒక్క "ఆత్మహత్య" చేసుకున్నప్పుడు తప్ప
(ఆత్మహత్య మహాపాపం అని చెప్పబడింది కాదు. ఇది ఆత్మజ్ఞాన రహితులందరికీ తప్పనిసరిగా, విధిగా వర్తిస్తుంది. అయితే ఒకానొక ఆత్మజ్ఞానికి, ఒకానొక బ్రహ్మజ్ఞానికి బ్రహ్మహత్యాపాతకం లేదు ... ఆత్మహత్యాపాతకం లేదు)
**ఆత్మ**కు ఉన్నదంతా గెలుపే ...
**ఆత్మ**కు ఉన్నదంతా నిత్యనూతనత్వమే
ఒకానొక **ఆత్మ** ... ఒకానొక మానవ శరీర ధారణ చేసినప్పుడు ...
ఒకానొక జీవిత స్థితిని ఎదుర్కొంటుంది
ఆ తరువాత ... ఇక రకరకాల జీవిత పరిస్థితులను
అనుభవించటానికి ఆరాటపడుతూంటుంది.
మానవ జీవిత పరిస్థితులన్నింటినీ అవగాహన చేసుకోవడానికి
**ఆత్మ**కు కనిష్ఠ పరంగా నాలుగు వందల జన్మల్లో ఆరితేరిన **ఆత్మ**

ఒకానొక **"అనుభవాల పుట్ట"**గా తయారవుతుంది.

అనేకమార్లు జన్మించి .. అంటే అనేకమార్లు శరీరంలో చేరి

అనేకమార్లు మరణించి .. అంటే అనేక మార్లు శరీరంలోంచి బయటపడి

అనేక రకాల అవమాన – దుఃఖ – తిరస్కారాదులను భరించి

అనేక మార్లు మాన – సుఖ – పురస్కారాదులను అనుభవించి

ఒకానొక సంపూర్ణ **"జ్ఞానపు పుట్ట"**గా తయారవుతుంది

ప్రతి జన్మ కూడా **ఆత్మ**కు అనేకానేక అనుభవాలను అందిస్తుంది

ప్రతి అనుభవం కూడా **ఆత్మ**కు ఒకానొక విశిష్ట జ్ఞానసారాన్ని ప్రసాదిస్తుంది

**ఆత్మ** అన్నది ... ప్రప్రథమంగా .. ఒక **కోరికల పుట్ట**

**ఆత్మ** అన్నది ... పరంపరగా ... ఒక **అనుభవాల పుట్ట**

**ఆత్మ** అన్నది ... అంతిమ పర్యవసానంగా ఒక **జ్ఞానపు పుట్ట**

**ఇదీ ఆత్మ యొక్క అసలు కథ**

**ఓం తత్ సత్**

# తటవర్తి వీరరాఘవరావు గారి రచనలు

| | |
|---|---|
| 1) జీవితశాస్త్రం (మొదటి భాగం) | - రూ.100/- |
| 2) జీవితశాస్త్రం (రెండవ భాగం) | - రూ.100/- |
| 3) జీవిత సత్యాలు | - రూ.100/- |
| 4) భగవంతుడంటే | - రూ.100/- |
| 5) సత్యమార్గం | - రూ.100/- |
| 6) ఆత్మ శాస్త్రం | - రూ.100/- |
| 7) ధ్యాన శాస్త్రం | - రూ.100/- |
| 8) జ్ఞానరసగుళికలు (పత్రీజీ) | - రూ.100/- |
| 9) పరమగురువుల ప్రబోధాలు (పత్రీజీ) | - రూ.100/- |
| 10) భగవద్గీతా సారం - శ్రీ కృష్ణ సందేశం | - రూ.100/- |
| 11) ధ్యాన శక్తి | - రూ.100/- |
| 12) తెలుసుకోండి | - రూ.120/- |
| 13) జీవిత సూక్ష్మాలు | - రూ.120/- |
| 14) గీతాసందేశం | - రూ.100/- |
| 15) కర్మ సిద్ధాంతం | - రూ.60/- |
| 16) బ్రహ్మజ్ఞానం | - రూ.60/- |
| 17) ఆత్మజ్ఞానం ఎందుకు? | - రూ.70/- |
| 18) ధ్యానమంటే ? | - రూ.50/- |
| 19) జ్ఞాన జ్యోతి | - రూ.70/- |
| 20) జ్ఞాన కుసుమాలు | - రూ.50/- |
| 21) దుఃఖ నివారణామార్గం | - రూ.60/- |
| 22) త్రివిధాలు | - రూ.60/- |
| 23) ధ్యానం (పత్రీజీ) | - రూ.50/- |
| 24) ధ్యానం వల్లనే జ్ఞానం | - రూ.60/- |
| 25) అతీంద్రియ శక్తులు | - రూ.50/- |
| 26) శాస్త్రాల అర్థం- అంతరార్థం | - రూ.50/- |
| 27) ఆశ్చర్యం... ఆశ్చర్యం | - రూ.50/- |
| 28) విద్యార్థుల వికాసానికి ధ్యాన విద్య | - రూ.50/- |
| 29) మౌన ధ్యానం | - రూ.40/- |
| 30) ఈ జీవితం ఎందుకు? | - రూ.50/- |
| 31) నిర్వాణ మార్గం | - రూ.50/- |
| 32) షిరిడీసాయి సందేశాలు | - రూ.40/- |
| 33) భాగవత సన్నివేశాల అంతరార్థం | - రూ.40/- |
| 34) భూతదయే దైవత్వం | - రూ.40/- |
| 35) ఆలోచించండి | - రూ.40/- |
| 36) సంకల్పమంటే? | - రూ.50/- |
| 37) మరోజన్మ (తటవర్తి రాజ్యలక్ష్మి) | - రూ.30/- |
| 38) మనం ఇహలోకవాసులమా? పరలోకవాసులమా? | - రూ.20/- |
| 39) శాకాహారమే మానవాహారం | - రూ.15/- |
| 40) అహింస మరియు శాఖాహారం | - రూ.15/- |


పుస్తకముల కొరకు :

**తటవర్తి వీర రాఘవరావు,**

తటవర్తివారి వీధి, భీమవరం-1. ప॥గో॥జిల్లా.

సెల్ : 9440309812, 9490171853



## "జ్ఞానాన్ని పెంపొందించుకోవాలి"

అర్జునుడు బుద్ధిని మాత్రమే కలిగి వున్నాడు; అయితే శ్రీ కృష్ణుడు ఆత్మజ్ఞానాన్ని కూఐడా పెంపొందించుకుని పరమాత్ముడయ్యాడు. కృష్ణుడు అర్జునుడిని ఉద్దేశించి తస్మాత్ యోగీభవ అర్జున అన్నాడు. మనమంతా కూడా కేవలం అర్జునుడి వలె కేవలం బుద్ధి మాత్రమే కలిగి వుంటే సరిపోదు. కృష్ణుని వలె 'జ్ఞానాన్ని' కూడా పెంపొందించుకోవాలి. జ్ఞానం అంటే ఆత్మ యొక్క జ్ఞానం. అది కేవలం ధ్యానంతోనే సంభవం.

ధ్యానం అనేది ఒకరు ఇస్తే మరొకరు తీసుకునే వస్తువు కాదు. ఉదాహరణకు... సంగీతం... అది తీసుకుంటే వచ్చేది కాదు; కేవలం సాధన ద్వారానే సాధ్యమవుతుంది.

– బ్రహ్మర్షి పత్రీజీ

**రూ.60/–**